శ్రీ రామ

# ధర్మనిర్ణయచంద్రికా

## ద్వితీయభాగః ప్రారభ్యతే॥

## ఆదౌ ఆశౌచస్వరూపం కథ్యతే॥

శ్లోకమ్॥ కర్మస్వనధికారత్వ । మస్పృశ్యత్వంచ దేహినామ్।
యతః పాపా త్ప్రభవతి। త దాశౌచ మితీర్యతే॥

తాత్పర్యము॥ మనుజులకు వేదచోదితకర్మల నాచరించుటకు వీలు లేకుండుటయు, ఇతరులను స్పృశింప నర్హతలేకుండుటయు నే పాపము వలన కలుగునో అదియే యాశౌచ మనబడును.

ఆశౌచము మూడురకములు (1) రజస్వలాశౌచము (2) జాతాశౌచము (3) మృతాశౌచము.

### అథ రజస్వలాశౌచవిధిః

శ్లో॥ ప్రథమే ఽహని చండాలీ। ద్వితీయే బ్రహ్మఘాతినీ।
తృతీయే రజకీ ప్రోక్తా। చతుర్థే శూద్రికా భవేత్॥
పంచమే ఽహని శుద్ధా స్యాత్। హవ్యకవ్యాదికర్మసు।
చతుర్థే ఽహని భర్తుస్స్యాత్। శుద్ధా సంభోగకర్మణి॥

తా. రజస్వలయైన స్త్రీ మొదటిదినమున చండాలి, రెండవ దినమున బ్రహ్మఘాతిని, మూడవ దినమున రజకస్త్రీతో సమానురాలును, నాల్గవ రోజున శూద్రస్త్రీతో సమానురాలును అగును, అయిదవ రోజున

దేవపితృకార్యాచరణమున కుపయోగ్యురాలగును. నాల్గవ రోజున భర్తకు సంభోగార్హురాలగును.

శ్లో॥ రజోదర్శన మారభ్య । త్ర్యహా మాశౌచ మీరితమ్,
ఆసప్తదశపర్యంతం । స్నాన మష్టావశే ఉహని॥
ఊనవింశే ద్వ్యహం స్త్రీణాం । ఉపరిష్టా త్త్రిహం స్మృతమ్,
రజస్వలా చతుర్థే ఉహ్ని । స్నానా చ్ఛుద్ధి మవాప్నుయాత్॥

తా. స్త్రీ రజస్వలయైనదిమొదలు 3 దినములాశౌచము. రజస్వలయైనదినము మొదలు 17 దినములలోపల మరల రజస్వలయైన స్నానముతోసరి. 18 వ రోజున రజస్వలయైనచో నొకదిన మాశౌచము. 19 వ దినమున రజస్వలయైనచో రెండు దినము లాశౌచము. ఆపైని 3 దినము లాశౌచము. రజస్వలయైన స్త్రీ స్నానముచే శుద్ధురాలగును. ఇది ఆంధ్రాచారము. ద్రావిడాచార మెట్లనిన:_ రజస్వలయైనదినము మొదలు 12 దినములలోపల మరల రజస్వలయైనచో స్నానముచే శుద్ధియగును. 12 దినములకు పైన మూడుదినము లాశౌచము.

స్మృతిరత్నమహోదధౌ:_

శ్లో॥ రజ శ్చతుర్విధం జ్ఞేయం । రోగజం రాగజం తథా,
ధాతుజం కాలజం చేతి । యోషితాం తు శరోత్తమే॥
రోగేణ యద్రజ స్త్రీణా । మత్యర్థం తు ప్రవర్తతే,
అశుద్ధా నైవ తా స్తేన । యస్మా ద్వైకారికం తు తత్॥

చంద్రికాయాం:_

అకాలే య ద్భవేత్ స్త్రీణాం । రక్త మాస్రావ ద్మనీషిణః।
కాలేతు త ద్రజః ప్రోక్తం । తస్మా త్తత్రైవ సా శుచిః॥

అంగిరాః:_

ఆద్వాదశాహా న్నారీణాం । మూత్రవ చ్ఛౌచ మిష్యతే,
అష్టాదశాహాత్ స్నానం స్యాత్ । త్రిరాత్రం పరతో ఉశుచి॥

నిర్ణయామృతే :—

చతుర్దశదినా దర్వా గశుచిత్వం న విద్యతే॥

సంగ్రహే :—

ఏకాదశాహా త్పూర్వేతు స్నాత్వా శుద్ధి మవాప్నుయాత్।
తదూర్ధ్వంతు త్రిరాత్రం స్యాత్ । యథాపూర్వం రజస్వలా॥
తదూర్ధ్వం = దశదినా దూర్ధ్వ మిత్యర్థః॥

రోగజత్వే నాశుచిత్వ ముక్తం సంగ్రహే:—

రోగేణ యద్రజ స్త్రీణా । మన్వహంహి ప్రవర్తతే।
నాశుచిత్వం భవే త్తేన । యస్మా ద్వైకాలికం హి తత్॥

తత్రాపి స్వకాలే త్వశుచిత్వ మాహ ఋష్యశృంగః :—

రోగజం ప్రతిమాసేపి । కాలే విర్యాతి కాలజం।
తస్మా త్కాలే ఉప్రమత్తా స్యా । దన్యథా సంకరో భవేత్॥

అత్ర విజ్ఞానేశ్వరః :—

యదా రజోదర్శనా దారభ్య పున స్సప్తదశదినాభ్యంతరే రజో దర్శనం తదా అశుచిత్వం నా స్త్యేవ॥

నిర్ణయామృతే :—

చతుర్దశదినా దర్వా । గశుచిత్వం నవిద్యత ఇతి స్నానదినా దారభ్య పరిగణయే దిత్యర్థః॥ ఏవం సతి, సప్తదశదినాని జాయన్తే । తత్ర స్నానమాత్రం ॥ తతఃపూర్వదినేషు నా స్త్యశుచిత్వ మిత్యర్థః ॥ అష్టాదశే త్వేకరాత్రం। ఏకోనవింశే చాహర్ద్వయం। వింశతిదినా దూర్ధ్వం త్రిరాత్ర మశుచిత్వ మిత్యర్థః॥

తా॥ రజస్సు 4 రకములు. 1. రోగమువలన కలుగునది, 2. అనురాగమువలన జనించునది. 3. ధాతువులవలన పుట్టునది. 4. ప్రతి

మాసముననుస్త్రీలకు సహజముగా సంభవించునది. అకాలమందు స్త్రీలకు రోగముచే నధికముగా రజస్సు ప్రసరించినచో దానివల్ల నపరిశుద్ధత ఏర్పడదు. అకాలమున గల్గుదానిని రక్తమని పెద్దలు చెప్పుదురు. సకాలమునగల్గు దానికి రజస్సని పేరు. అకాలమునగల్గు రక్తమువలన నశుచిత్వములేదని చంద్రికయందు చెప్పబడియె. 12 వ రోజువరకు స్త్రీలకు గల్గెడురజస్సునకు మూత్రమునకువలె శుద్ధియనియు. 18 వ రోజువరకు స్నానమాత్రమనియు. అటుపిమ్మట 3 దినము లాశౌచ మనియు నంగిరుడు వచించెను. 14 వ దినమునకు పూర్వ మశుచిత్వము లేదని నిర్ణయామృతమునందు గలదు. 11 వ దినమునకు పూర్వము స్నానముతో శుద్ధి, అంతకుపైన 3 దినము లాశౌచము; రోగమువలన గలిగినదాని కశుచిత్వము లేదనియు సంగ్రహమునందు జెప్పబడియె. రోగమువలనగల్గినదానికిని, సకాలమునం దశుచిత్వమును ఋష్యశృంగుడు వచించెను. కనుక సకాలమునం దప్రమత్తురాలై యుండవలెను, లేనిచో సంకరమగును. విజ్ఞానేశ్వరు డీక్రిందివిధమున బేర్కొనెను - 17 దినములలోపల రజోదర్శనమైనచో దోషములేదు. నిర్ణయామృతమునం దీక్రిందివిధమున వర్ణింపబడియుండె. 14 రోజులలోపల మరల రజోదర్శనమైనచో నశుచిత్వము లేదు. స్నాన దినము మొదలని యర్థము - అట్లయినచో 17 దినములగును. - 17 దిన ములలోపల స్నానమాత్రము. 18 వ దినమున నొకరో జాశౌచము. 19 వ దినమున 2 రోజు లాశౌచము. 20 వ దినము అంతకు పైన 3 దినము లశుచిత్వము.

నోటు:—ఇది యాచరణలో లేదు. స్నానమైనపిమ్మట వారము రోజులయనంతర మెప్పుడైనను మూడురోజు లుండుట యాచరణలో నున్నది.

## ఆశౌచదిన నిర్ణయము

కాశ్యపః:-

రాత్రిం భాగత్రయం కృత్వా । ద్వౌ భాగౌ పూర్వవాసరే
ఉత్తరార్థం పరదిన । మృతౌతు మృతసూతయోః॥

తా. రాత్రియందు రజోదర్శనము, జాతము, మృతము సంభవించెనేని ఆరాత్రిప్రమాణమును మూడుభాగములుచేసి మొదటి 2 భాగములలోను రజోదర్శనాదులు సంభవించెనేని పూర్వదినముగను, మూడవ భాగమున సంభవించెనేని పరదినముగను తెలిసికొనవలెను.

## అథ రజస్వలాధర్మాః

ధర్మప్రవృత్తౌ 152 పుటే:-

శ్లో॥ ఆర్తవాభిప్లుతా నారీ । నైవ వేశ్మని సంవిశేత్।
న సంసర్గం వపేత్సద్భిః । స్నాత్వా పాపాత్ప్రముచ్యతే॥
త్రిరాత్రం స్వముఖం నైవ । దర్శయేచ్ఛ్రావయేద్వచః।
అంజనాభ్యంజనం స్నానం । ప్రవాసం దంతధావనమ్॥
న కుర్యాత్సార్తవా నారీ । గ్రహాణా మీక్షణం తథా।
నఖానాం కృంతనం రజ్జు । తాళపత్రాదిబంధనమ్॥
దగ్ధే శరావే భుంజీయా । త్స్వయం చాంజలినా పిబేత్।
అస్తంగతే యదా సూర్యే । నైవ భోజన మాచరేత్॥
వర్జయే న్మధుమాంసంచ । సద్ధర్మ మపి వర్జయేత్।
గంధం మాల్యం దివా స్వాపం । తాంబూలం చాస్యశోధనమ్॥
తస్మా దుదక్యయా సార్ధ। మేకగేహే న సంవిశేత్।
ప్రతిగ్రహంచ సంవాద । మన్యత స్నా వివర్జయేత్॥
రజస్వలా పతిం గచ్ఛే। చ్చండాలో జాయతే సుతః।
రేతోదస్తు తథైవ స్యా । జ్జన్మజన్మని సాపిచ॥

ఆర్తవాభిప్లుతాస్నాతా । జాత స్త్వప్సు నిమజ్జతి।
తైలే నాభ్యంజనే చైవ । కుష్ఠరోగీ తు జాయతే॥
ఆర్తవే నిఖనే ద్భూమిం। అల్పాయు ర్జాయతే ఖలః॥
నేత్రయో రంజనం కుర్యా । త్కాణోఽపాణిశ్చ జాయతే॥
పుష్పిణీ దంతధావీ స్యా । జ్జాయతే స్యావదంతకః॥
నఖానాం కృంతనం కుర్యా । త్కునఖీ జాయతే సుతః॥
పర్ణపాత్రేషు యా భుంక్తే । ప్రమత్తో జాయతే సుతః॥
ఉదక్యాఫలదం క్షౌద్రం । గంధపుష్పం ఫలం త్యజేత్॥
శౌచాదిశోధనం జహ్యాం । ప్రజాదోషకరం స్మృతమ్।
చర్మకాష్ఠమయోవాపి । పాదుకే చాధిరోహయేత్॥
రజస్వలా యదా స్పృష్టా । శ్వానశూద్రాంత్యజై ర్భవేత్।
తావ త్తిష్ఠే న్నిరాహారా । స్నాత్వా కాలేన శుధ్యతి॥
అశక్తా హ్యుపవాసానాం । దత్వా శక్త్యాచ దక్షిణామ్।
ఏవ ముక్తప్రకారేణ । త్రిస్రో రాత్రీ ర్నయే దథ॥
ఆగళా న్నైత్యికస్నానం । పతివత్న్యా విధీయతే।
అస్పృశ్యేచ ప్రయోగేచ । సశిరస్కం విధీయతే॥
శుద్ధా భర్తు శ్చతుర్థేఽహ్ని । స్నానేన స్త్రీ రజస్వలా।
దైవే కర్మణి పిత్ర్యేచ । పంచమే ఽహని శుధ్యతి॥

తా॥ రజస్వలయైన స్త్రీ గృహమునం దుండరాదు. ఇతరుల స్పృశింపరాదు. మూడుదినములవరకు ముఖము నితరులకు జూపరాదు. ఇతరులతో సంభాషింపరాదు. మూడుదినములపిమ్మట స్నానము చేసినచో పవిత్రురా లగును. రజస్వలయయిన స్త్రీ మూడుదినముల లోపుగా కాటుక నుంచుకొనరాదు. తలంటుకొనరాదు. గ్రామాంతరమున కేగరాదు. దంతధావనము చేయగూడదు. గ్రహముల దర్శన

రాదు. గోళ్ళుగిల్లుకొనరాదు. తాళ్ళను, తాటియాకులను ముడివేయరాదు. కాలినమూకుడులోగాని. దోసిలియందుగాని భుజింపవలెను. ప్రొద్దుగ్రుంకినపిమ్మట భుజింపరాదు. మధు, మాంస, సద్ధర్మముల వదలవలెను. గంధమాల్యములచే నలంకరించుకొనరాదు. దివాస్వాపమును, తాంబూలభక్షణమును, ముఖశోధనమును చేయరాదు. రజస్వలయైన స్త్రీతో నొకేయింట నుండరాదు. ప్రతిగ్రహ సంవాదములు పనికిరావు. భర్తృసంయోగము నాచరింపరాదు. మోహంబున సంయోగము నాచరించినచో గల్గెడు సంతతియు, తానును, భర్తయు ననేక జన్మముల వరకు చండాలురగుదురు. రజస్వలా స్త్రీ నూనెతో తలంటుకొనినచో ననంతరము కలిగెడు సుతుడు కుష్ఠురోగి యగును. కాటుక పెట్టుకొనినచో కాయకంటిసుతు దుద్భవించును. దంతధావన మాచరించినచో పుప్పిపండ్లు గలవాడును, గోళ్ళను గిల్లుకొనినచో పుప్పిగోళ్ళుగలవాడును, పర్ణపాత్ర యందు భుజించిన ప్రమత్తుడగు వాడును జనించును. గంధ, పుష్ప, ఫల, తాంబూలముల గ్రహింపరాదు. తోలుతోగాని, కొయ్యతోగాని తయారు చేసినపాదుకలను ధరింపవలెను. శ్వాన, శూద్ర, అంత్యజులను స్పృశించినచో మూడుదినము లతిక్రమించువరకును భుజింపరాదు, ఉపవసించుటకు శక్తిలేనిచో దక్షిణనిచ్చి భుజించుచు మూడుదినములు గడుపవలెను. మూడుదినములును కంఠస్నానము చేయవలెను. శిరస్నానమాచరించరాదు. నాలుగవరోజు స్నానమయినపిమ్మట భర్తృసంయోగమునకు పనికివచ్చును. ఐదవదినమున స్నానమాచరించినపిమ్మట దేవపితృకార్యాదులయం దుపకరించును.

## ప్రథమ రజస్వలాయాం విశేషః

లక్ష్మీపతి సోమయాజీయే - ధర్మసంధా ౧౦౭ పుటే-

అథ ప్రథమర్తౌ అక్షతై రాసనం కృత్వా. తత్ర తా ముపవేశ్య. పతివ్రతవత్య స్త్రియో హారిద్రాకుంకుమగంధ పుష్పస్రక్తాంబూలాది

పదీపాలంకృతే గృహే తాం వాస
తస్యై దత్వా। దీపై ర్నీరాజ్య, సువాసినీభ్యో గంధాదికం లవణ ముద్గాదిచ దద్యాత్॥
యేయు॥ సువాసినీభ్యో గంధాదికం లవణ ముద్గాదిచ దద్యాత్॥
వైదికాభరణే- 126 పుటే స్మృతిసారే 233 పుటే - ధర్మప్రవృత్తౌచ:-

శ్లో॥ ప్రథమర్తౌచ పుణ్యాళ్ప। పతిపుత్రయుతా స్త్రియః।
అక్షతై రాసనం కృత్వా। తస్మిం స్తా ముపవేశయేత్॥
హారిద్రాగంధపుష్పాదీన్। దద్యు స్తాంబూలకం స్రజమ్।
దీపై ర్నీరాజనం దద్యా। త్తద్దీపం వాసయే ద్గృహే॥
తాంబూలాదినిషేధః ప్రథమర్తువ్యతిరేకవిషయః॥

తా. ప్రథమరజస్వలయైన స్త్రీని అక్షతలచే నాసనమును కల్పించి దానియందు కూర్చుండజేసి, భర్త పుత్రులు గల స్త్రీలు పసుపు, కుంకుమ, పుష్పములు, పూలదండలు, తాంబూలాదు లామె కిచ్చి, నీరాజన మొసంగి, దీపయుక్తమైన గృహమం దాయమను నివసింపజేయవలెను. సువాసినీస్త్రీలకు గంధాదులను, ఉప్పు, పెసలు మొదలగు మంగళ ద్రవ్యములను ఇవ్వవలెను. పుష్పతాంబూలాదినిషేధము ప్రథమర్తు వ్యతిరేకవిషయము అనగా ప్రథమరజస్వలయైన స్త్రీ పుష్పతాంబూలా దుల నుపయోగింపవచ్చును. ద్వితీయాది రజస్వలలయం దుపయోగింప రాదు.

రజస్వలాసూతికాదీనాం జ్వరాదినా స్నానాశక్తౌ

లక్ష్మపతిసోమయాజీయే - ధర్మసింధౌ - 108 పుటే - అపరకృష్టి యోత్తరఖండే 34 పుటేపి॥

యది జ్వరాదిభి రాతురా చతుర్థే౽హని స్నాతుం నశక్తా, తదా తా మన్యనారీ నరోవా దశవారం స్పృష్ట్వా స్పృష్ట్వా, స్నాయా దాచామేచ్చ॥ ప్రతిస్నాన మాతురస్యవస్త్ర మన్య దన్య త్పరిధాపనీయం॥

అంతే, స్పృష్టానాం సర్వవస్త్రాణాం త్యాగః। ఆర్ద్రవస్త్రవ్యవధానేన, శుద్ధవస్త్రగ్రహణాంతే, బ్రాహ్మణభోజనా త్పుణ్యాహవాచనాచ్చ శుద్ధిః॥ సర్వేషా మప్యాతురాణా మేవం శుద్ధి ర్విధీయతే॥

నిర్ణయసింధౌ 139 పుటే

జ్వరేశానాః। జ్వరాభిభూతా యా నారీ। రజసాచ పరిప్లుతా।
కథం తస్యా భవే చ్ఛౌచం। శుద్ధి స్స్యా త్కేనకర్మణా॥

చతుర్థే ఒహని సంప్రాప్తే స్పృశే దన్యాతు తాం స్త్రియమ్।
సా సచైలావగాహ్యైవ। స్నాత్వాస్నాత్వా పున స్పృశేత్॥
దశ, ద్వాదశకృత్వోవా। ఆచామేచ్చ పునః పునః।
అన్తేతు వాససాం త్యాగ। స్తత శ్శుద్ధా భవేత్తు సా॥

ఇదం చాతురమాత్రే జ్ఞేయం॥ ఆతురే స్నాన ఉత్పన్నే దశ కృత్వో హ్యనాతుర ఇతి పరాశరోక్తేః॥ స్మృతిసారే 248 పుటే ప్యనేనైవాభిప్రాయే ణోక్తః॥ తదత్ర గ్రంథవిస్తరభయా న్నలిఖితః॥

తా॥ ధర్మసింధువునందును, అపరకృష్ణియోత్తరఖండమునందును, నిర్ణయసింధు 139 వ పుటలోను ఉశనసునిచే నిట్లు చెప్పబడియెను. రజస్వలయైన స్త్రీ జ్వరాదులచే బాధపెట్టబడుచున్నదై 4 వ రోజున స్నానమున కశక్తురాలైనచో మరియొక స్త్రీగాని, పురుషుడుగాని స్నానముచేసి, యాచమనం బాచరించి, తడివస్త్రములతో నామెను తాకి, ఆతురురాలియొక్క వస్త్రము నార్ద్రవస్త్రవ్యవధానముతో విప్పించి, మరియొకపొడివస్త్రమును ధరింపజేయవలెను. మరల స్నానముచేసి యాచమించి, తడివస్త్రముతో నామెను తాకి, ఆతురురాలివస్త్రము నార్ద్రవస్త్రవ్యవధానముతో విప్పించి, మరియొకపొడివస్త్రము నుధరింపజేయవలెను,

ఈవిధముగా 10 లేక 12 పర్యాయము లాచరించినచో నామెకు శుద్ధి గల్గును. స్నానముచేయించకయే గృహములోనికి తీసికొనిరావచ్చును.

పైవిధముగనే, రోగగ్రస్తురాలగు సూతికాస్త్రీనిగావి, జాతాశౌచమృతాశౌచశుద్ధిదినములందు రోగాతురులగు స్త్రీపురుషులనుగాని పరిశుద్ధులను చేయవచ్చును.

పైవిధమున పురుషుడు రజస్వలాదిస్త్రీలను పరిశుద్ధురాండ్రను చేసినచో మరల స్నానమాచరించి, పవమానాదిసూక్తములతో నూతన యజ్ఞోపవీతధారణ మాచరించి, గాయత్రీమంత్రజపమును చేయవలెను. పిమ్మట పుణ్యాహవాచనము బ్రాహ్మణభోజనముల నాచరింపజేయవలెను. ఆతురస్త్రీవదలిన 10, 12 వస్త్రములను పరిహరించవలెను. లేనిచో చాకలిచే ఉతికించవలెను. ఆతురుడు స్నానముచేయవలసి వచ్చినప్పు డనాతురుడు 10 పర్యాయములు స్నానము చేయవలెనను పరాశరోక్తివలన నీధర్మము ఆతురులవిషయమే వర్తించునుగాని, అనాతురులకు వర్తించదు. స్మృతిసారమందు 248 పుటలోగూడ నీవిధముననే వ్రాయబడియున్నది. గ్రంథవిస్తరభీతిచే నిచట వ్రాయలేదు.

రజస్వలాసూతికాపత్యోః కార్మానధికారః

స్మృతిరత్నమహోదధౌ:-

ఉదక్యాయాః పతిం యావ । త్సూతికాయాః పతిం తథా।
భాండస్పర్శనపర్యంతం । పైతృకే పర్జయే త్సుధీః ॥

స్మృతిముక్తాఫలే:-

రజస్వలాచ యా నారీ ప్రసూతాయాశ్చ యోషితః।
దైవే కర్మణి పిత్ర్యేచ। తస్యా భర్తా నశుధ్యతి॥

రజస్వలాయా స్సూతికాయాశ్చ పతిం దైవే పిత్ర్యేచ కర్మణి వర్జయేత్॥

తా. రజోవతియైన స్త్రీయొక్క భర్త 5 వ నాటివరకును దేవ పితృ కర్మలయం దుపయోగార్హుడు కాడు. మగపిల్లవానిని ప్రసవించిన స్త్రీభర్త 30 రోజువరకును, ఆడుపిల్లను కనిన స్త్రీభర్త 40 రోజుల వరకును దైవపితృకర్మల కుపయోగించడు.

గుంటూరుజిల్లా చివలూరు వాస్తవ్యులగు
బ్రహ్మశ్రీ కుప్పా వేంకటేశ్వరావధానులుగా రిట్లు వ్రాసిరి:

మాసాశౌచ విషయః

శ్లో॥ స్త్రీపుం ప్రసవేచైవ త్రింశద్వింశద్దినానిచ।
ఏకాదశదినారభ్య। త్రయాణాం జాతసూతకమ్॥

తా. స్త్రీప్రసవమునకు 11 వ రోజు మొదలు 30 రోజులును, పుంప్రసవమునకు 11 వ రోజుమొదలు 20 దినములున్నూ జాతాశౌచ మును పైశ్లోకప్రమాణము వచించుచున్నది. అనగా స్త్రీశిశువునకు ప్రసవదినారభ్య 40 రోజులున్నూ పురుషశిశువయ్యేనేని ప్రసవదినా రభ్య 30 రోజులున్నూ జాతాశౌచము గలదు. ఈజాతాశౌచము పత్నీసుత పతులకు ముగ్గురకు గలదు.

మాతాపితృశిశోశ్చ త్రయాణాం జాతాశౌచం వర్తతే॥

శ్లో॥ ఉదక్యాయాః పతిం యావ। త్సూతికాయాః పతిం తథా।
భాండస్పర్శనపర్యంతం। హవ్యకవ్యేషు వర్జయేత్॥
తాళపత్రలిఖితగ్రంథమున గలదు. ఏస్మృతియో తెలియదు.

సూతికా పతికిని, గర్భిణీపతికిని, ఉదక్యాపతికిని ఆర్త్విజ్య మెంత

మాత్రమును పనికిరాదు. వివాహమునకుగాని, అభిషేకమునకుగాని, బ్రహ్మత్వమునకుగాని, మరి దేనికైనను పెద్దలు నిషేధించుచున్నారు భార్య పరిశుద్ధురాలగువరకును భర్తకూడ నిషేధింపబడవలసినదే (అని వ్రాసిరి).

అథ అసంస్కృతకన్యాయాం రజోదోషః

ధర్మప్రవృత్తౌ - స్మృత్యంతరేచ:-

ఆసంస్కృతాతు యా కన్యా । రజసాచ పరిప్లుతా।
భ్రాతరః పితర స్తస్యాః। పతితా స్స్యు ర్న సంశయః॥

తథాచ - ఇతిహాసే:-

పితుర్గృహేతు యా కన్యా। రజః పశ్య త్యసంస్కృతా।
సా కన్యా వృషలీ జ్ఞేయా। తత్పతి ర్వృషలీపతిః॥

తా. వివాహముగాక పూర్వము కన్యక రజస్వల యయ్యేనేని యామె తల్లిదండ్రులును, సోదరులును పతితు లగుదురు-అని స్మృత్యంతరమున చెప్పబడియె. అవివాహితురాలగు కన్యక తండ్రిగృహమున రజస్వల యయ్యేనేని, యాకన్య వృషలి యనబడును. ఆమె మగడు వృషలీపతి యనబడుననియు నితిహాసమున జెప్పబడియె.

మాధవీయే:-

శ్లో॥ ఉత్కృష్టా యాభిరూపాయ। వరాయ సదృశాయచ।
అప్రాప్తా మపి తాం తస్మై కన్యాం। దద్యా ద్యథావిధి॥

తా. ధనవంతుడు, రూపవంతుడు నగు వరుడు లభించినపుడు, వివాహవయస్సురానికన్యకనైనను యిచ్చి వివాహము యథావిధిగ చేయవలెను.

బోధాయనః:-

దద్యా ద్గుణవతే కన్యాం । నగ్నికాం బ్రహ్మచారిణే।
అపివా గుణహీనాయ । నోపరుంధ్యా ద్రజస్వలామ్॥

నగ్నికాం = శ్రేష్ఠాం– 9 సంవత్సరముల వయస్సుకలది.

తా. యోగ్యురాలైన 9 సం॥ల ఈడుగల కన్యకను, గుణవంతుడైన వరున కిచ్చి వివాహమాచరించవలెను. గుణవంతుడు లభించనిచో గుణహీనునికైన నీయవలెనుగాని, రజస్వల యగువరకు నావరాదు.

సంవర్తోపి:-

కామకాలే తు సంప్రాప్తే సోమో భుంక్తే తు కన్యకామ్।
రజః కాలేతు గంధర్వో । వహ్నిస్తు కుచదర్శనే॥
తస్మా దుద్వాహయే త్కన్యాం । యావ న్నర్తుమతీ భవేత్॥

తా. కన్యకకు కామకాలము సంభవించినపుడు సోముడును, రజఃకాలమందు గంధర్వుడును, కుచదర్శనమున వహ్నియు ననుభవింతురు. కనుక ఋతుమతి కాని కన్యకను వివాహమాడవలెను.

వయోవిశేషేణ దాతుః ఫలవిశేష మాహ॥

మరీచిః:-

గౌరీం దద న్నాకపృష్ఠం । వైకుంఠం రోహిణీం దదన్।
కన్యాం దదన్ బ్రహ్మలోకం । రౌరవంతు రజస్వలామ్॥
అష్టవర్షా భవే ద్గౌరీ । నవవర్షాతు రోహిణీ।
దశవర్షా భవే త్కన్యా । అతఊర్ధ్వం రజస్వలా॥

సంవర్తోఽపి:-

అష్టమే తు భవే ద్గౌరీ । నవమే నగ్నికా భవేత్।
దశమే కన్యకా ప్రోక్తా । ద్వాదశే వృషలీ స్మృతా॥

తా. గౌరిని దానమిచ్చినచో మోక్షము లభించును. రోహిణిని దానమొనర్చినచో స్వర్గము గల్గును. కన్యాదానమొనర్చినచో బ్రహ్మ లోకము సంభవించును. రజస్వలను దానమొనరించినచో రౌరవ మను మహానరకము ప్రాప్తించు నని మరీచి వచించెను.

8 సం॥ల వయస్సుగలది గౌరియనియు, 9 సం॥లు గలది రోహిణి యనియు, 10 సం॥లు గలది కన్యక యనియు, అంతకు పైబడినది రజస్వలతో సమానురాలనియు మరీచివచనము.

8 సం॥లు గలది గౌరియనియు, 9 సం॥లు గలది నగ్నికయనియు, 10 సం॥లు గలది కన్యక యనియు, 12 సం॥లు గలది వృషలి యనియు సంవర్తుడు వచించెను. దీనినిబట్టి 11 సం॥లు వెళ్ళులోపల వివాహము చేయవచ్చునని సంవర్తునిమత మని తోచుచున్నది.

బృహస్పతిః :-

ప్రాప్తేతు ద్వాదశే వర్షే । యః కన్యాం న ప్రయచ్ఛతి।
మాసిమాసి రజస్తస్యాః । పిబన్తి పితరో౽నిశమ్॥

వాక్యం॥ ఋతుదర్శన ముపలక్షయితుం ద్వాదశే వర్ష ఇత్యుక్తమ్ అతఏవ గౌతమేన ప్రదానం ప్రాగృతుదర్శనా దిత్యుక్తమ్॥

యమో౽ ప్యేత దాహ:-

తస్మా దుద్వాహయే త్కన్యాం । యావ న్నర్తుమతీభవేదితి.

అతశ్చ ఋతుదర్శనాం త్ప్రాగ్యో న ప్రయచ్ఛతి తస్య పితరః ప్రతి మాసం తద్రజః పిబన్తి । అనృతుదర్శనే ద్వాదశేపి వర్షే కన్యాదానప్రతి గ్రహావ నిషిద్ధౌ॥

తా. ఎవరు కన్యక 12 సం॥లు వచ్చినను వివాహ మొనరించరో వాని పితృదేవతలు ప్రతిమాసము నా కన్యకరజస్సును పానముచేయు దురు. ఋతుదర్శనకాలము 12 వ సం॥ము గాన 12 వ సంవత్సరము వచ్చినను అని నుడివిరి. పై విధముగా బృహస్పతి వ్రాక్రుచ్చెను. కనుకనే గౌతములవారు ఋతుదర్శనముకాకపూర్వము కన్యాదాన మొనర్ప వలెనని వచియించిరి. ఋతుమతికానికన్యను వివాహామాడవలెనని యముడు నుడివెను. కావున ఋతుదర్శనా త్పూర్వము ఎవరు కన్యా దానముచేయరో వారిపితృదేవతలు ప్రతినెలయు నాకన్యక రజఃపాన మొనరించెదరు. ఋతుదర్శనము కానిచో 12 వ సంవత్సరమందైనను కన్యాదాన ప్రతిగ్రహమువలన దోషము సంభవించదు.

శ్లో॥ య స్తాం సముద్వహే త్కన్యాం । బ్రాహ్మణో మదమోహితః
అసంభాష్యో హ్యపాం క్తేయః । సవిప్రో వృషలీపతిః॥

మనుః:-

యః కరో త్యేకరాత్రేణ । వృషలీ సేవనం ద్విజః।
సభై క్ష్యభు గ్జప న్నిత్యం । త్రిభి ర్వర్షై ర్విశుధ్యతి॥

వాక్యం॥ రజోదర్శనాత్ప్రాగ్దానం యథా నరకహేతుః తథా రజ స్వలోద్వాహోపి తద్ధేతు రిత్యాహ యమ ఇతి వ్యాఖ్యానం:- తాం = దృష్టరజసం, అసంభాష్యాపాం క్తేయత్వ యో ర్హేతుః వృషలీపతిత్వం వివాహా త్పూర్వం దృష్టరజస్కా వృషలీ.

తా. వివాహాత్పూర్వము రజస్వలయైన స్త్రీ వృషలి యనబడును. అట్టిదానిని వివాహమాడినవాడు వృషలీపతి. అట్టి వృషలి నెవడు మద మోహితుడై వివాహమాడునో వానితో మాటాడరాదు. పంక్తిభోజ నము కూడదు. ఎవ్వడొక్కదినము వృషలీ సేవన మాచరించి, పశ్చా

త్తప్త దగునో - అట్టివాడు ప్రతిదినమును గాయత్రీజపం బాచరించుచు, భిక్షాన్నమును భుజించుచు, మూడు సంవత్సరములు సంచరించినచో పరిశుద్ధు డగును.

కావున నో కన్యా, వర, పితరులారా! ఆస్తికు లగు నో ద్విజ వర్యులారా! రజస్వలానంతరవివాహమువలన మహాపాపమును శ్రుతి స్మృతులు ఘోషించుచున్నవి. ఎప్పటికైనను వివాహమొనర్చుట తప్పదుగాన, త్వరపడి రజస్వలాత్పూర్వమే వివాహమాచరించుటకు ప్రయత్నింపుడు. కర్మవశముచే కన్యక రజస్వలయైనచో రజస్వలయై నదిగదా తొందరేమని యాలసింపకుడు. ఎన్ని రజస్వలలైన నన్ని పర్యాయములు ప్రతినెలయును కన్యాదాతపితరులు రజఃపాన మొన రించుచుందురు. వరునికిని మహాపాతకము శాస్త్రమునందు చెప్పబడి యున్నది. 1,2 రజస్వలలైన స్త్రీని కన్యాదానముచేయు దాతకును, కన్యకును, అట్టిస్త్రీనివివాహమాడు వరునికిని ప్రాయశ్చిత్తము శాస్త్రము నందు చెప్పబడినది. అట్టి ప్రాయశ్చిత్తమొనర్చి వివాహమాచరించినచో దోషము లేదని విజ్ఞులు నుడివిరి.

## అథ కన్యారజోదోష నిర్ణయః

ధర్మసింధుసారే తృతీయపరిచ్ఛేదే 328 పుటే -

వివాహాత్పూర్వం కన్యాయా రజోదర్శనే మాతృపితృభ్రాతౄ ణాం నరకపాతః, కన్యాయాః వృషలీత్వం, తద్భర్తు ర్వృషలీపతిత్వం॥

అత్ర శుద్ధిప్రకారః॥ కన్యాదాతా ఋతుసంఖ్యయా గోదానాని, ఏకం గోదానం, యథాశక్తి బ్రాహ్మణభోజనం వా కృత్వా, కన్యాదానే యోగ్యో భవేత్॥ కన్యా తూపవాసత్రయాంతే గవ్యపయః పానం కృత్వా విప్రకుమార్యై సరత్నభూషణం దత్వా ఉద్వాహయోగ్యా భవతి॥ వరశ్చ కూశ్మాండహోమపూర్వకం తా ముద్వహ న్నదోషి స్యాదితి॥

వివాహహోమకాలే రజోదోషే తాం స్నాపయిత్వా యుఞ్జానేతి తైత్తిరీయమన్త్రేణ ప్రాయశ్చిత్తం కృత్వా హోమతంత్రం సమాపయేత్॥

యదా తు దాతృభావాద్రజోదర్శనం తదా కన్యా వర్షత్రయం ప్రతీక్ష్య. స్వయం. వరం వృణుయాత్॥ నాత్ర వరస్యాపి దోషః॥

ఇతి కన్యారజోదోషనిర్ణయః॥

తా. వివాహమునకు ముందు కన్యక రజస్వలయైనచో తల్లి, తండ్రి, సోదరులకు నరకపాతము సంభవించును. కన్యయు వృషలీత్వ మాపాదించును. ఆమె భర్త వృషలీపతి యనబడును.

దీనికి శుద్ధివిధానమును చెప్పుచున్నారు:- కన్యాదాత, కన్య యెన్నిరజస్వలలైనదో అన్నిగోదానములు చేయవలెను. శక్తిలేనిచో నొక గోదానమైన నాచరించవలెను. అందుకు నశక్తుడైనచో యథాశక్తి బ్రాహ్మణభోజనమునైన నాచరించినచో కన్యాదానము నాచరింప నర్హుడగును, కన్యక మూడుపవాసంబులఁజేసి, యనంతరము గోక్షీరంబుల ద్రావి, బ్రాహ్మణకన్యకు రత్నభూషణమును దానమొనర్చినచో వివాహయోగ్యురాలగును అట్టికన్యను వరుడు ముందుగా కూశ్మాండహోమము నాచరించి వివాహమాడినచో దోషి కాదు.

వివాహప్రధానహోమకాలమందు రజోవతియైనచో నట్టి కన్యను స్నానము చేయించి 'యుఞ్జానః ప్రథమం' అను తైత్తిరీయ మన్త్రముచే ప్రాయశ్చిత్తహోమమును చేయించి, హోమతంత్రమును సమాప్తినొందించవలెను. కన్యాదానము చేయువారులేక కన్యక రజస్వలయైనచో నట్టికన్యక 3 సం॥లు నిరీక్షించి స్వయముగనే భర్తను వరించి, వివాహమాడవలెను. అప్పుడు వరునికి దోషములేదు. ప్రమా

దముచే 1, 2 రజస్వలలైన స్త్రీలకే యీ ప్రాయశ్చిత్తము గాని, బుద్ధిపూర్వకముగా 2, 3 సంవత్సరములైనపిమ్మట నీ ప్రాయశ్చిత్తము వలన ప్రయోజనము లేదని పండితులు వచించిరి.

## రజస్వలాయాః శుద్ధిః

సంగ్రహే:-

మృతేచ సూతకే వాంతే । సంగవే స్నాన మాచరేత్।
సంగవా త్పరత స్స్నాన । మార్తవేతు విశిష్యత ఇతి॥

తా. మృతజాతాశౌచములయంతమందు, సంగవకాలమందు స్నానము చేసిన శుద్ధియగును. రజస్వలయైన స్త్రీ సంగవకాలము వెళ్ళినపిమ్మట స్నానము చేయవలెను. 6 గడియలు దాటినపిమ్మట సంగవకాలము వచ్చును. 12 గడియలకు సంగవకాలము వెళ్ళి మధ్యాహ్న కాలము వచ్చును.

రజస్వలాశౌచము సమాప్తము.

## అథ జాతాశౌచవిధిః

తత్రాదౌ కూటస్థలక్షణ నిరూప్యతే

మాత్స్యే:-

లేపభాజ శ్చతుర్థాద్యాః । పిత్రాద్యాః పిండభాగినః।
పిండద స్సప్తమ స్తేషాం । సాపిండ్యం సప్తపూరుషమ్॥

తా॥ కూటస్థపురుషునివదలి విడిపోయిన పురుషులవద్దనుండి లెక్కించుకొనవలెను. పిండదానముచేయువా డేడవవాడు, తండ్రి, తాత, ముత్తాత వీరు పిండభాగులు. నాల్గవపురుషుడు, వానితండ్రి, తాత, వీరు లేపభాక్కులు, ఈ సప్తపురుషులును సపిండులు. వారికిపైన ఏకుతరముల

వారు సమానోదకులు. అంతకుపైన నేమితరములవారును సగోత్రులు. సపిండులకు జాతాశౌచమృతాశౌచములు 10 రోజులు పట్టవలెను. సమానోదకులకు 3 దినము లాశౌచము. ఏడవవాని సంతానమునకు త్రిరాత్రము. 7 వ వానికి సంతతికలిగినను త్రిరాత్రమే. లెక్కచూచుకొను వాడు తనకు అవతల పురుషుడు ఏడవవాడైనచో వాని సంతానమునకు త్రిరాత్రమగును. సగోత్రులకు స్నానముతో శుద్ధియగును.

కులభేదేన ఆశౌచభేదనిరూపణమ్

ధర్మప్రవృత్తౌ 218 పుటే:-

శ్లో॥ ప్రసూతౌ చైవ సర్వేషాం । దశాహం సూతకం భవేత్।
క్షత్రియస్య ద్వాదశాహం । విట్ఛూద్రయోః పక్షమాసకే।
సచ్ఛూద్రస్య పక్షం॥

శ్లో॥ త్రిదినం యత్ర విప్రాణాం । క్షత్రాణాం స్యా చ్చతుర్దినమ్।
విశాం పంచదినం తత్ర । శూద్రాణాం చ దినాష్టకమ్॥

తా. జాతాశౌచ మన్నికులములవారికని పదిదినములే. మృతాశౌచము బ్రాహ్మణులకు 10 దినములు, క్షత్రియులకు 12 దినములు, వైశ్యులకు 15 రోజులు, శూద్రులకు 30 రోజులు, సచ్ఛూద్రులకు 15 రోజులు. బ్రాహ్మణులకు 3 దినము లాశౌచము నిర్ణయించినచోట క్షత్రియులకు 4 దినములు, వైశ్యులకు 5 దినములు, శూద్రులకు 8 దినములును విధించబడియున్నవి. త్రిరాత్రాశౌచ మందరకును 3 దినములే నని మతాంతరము గలదు

శ్రీగణేశాయ నమః.

# త్రింశచ్ఛ్లోకీ ప్రారంభః

సంస్కృతాంధ్ర వ్యాఖ్యానద్వయసహితమ్

గర్భస్రావపాత సూతకనిమిత్త సపిండాసపిండ విషయ

## కా శౌ చ మా హ

షణ్మాసాభ్యంతరేషు స్వపురుషనిహతే గర్భమాత్రే వినష్టే
మాతా తన్మాససంఖ్యా సమదిన మశుచిః స్నానశుద్ధాః సపిండాః
అంత్యే మాసద్వయేతు త్రిదిన మశుచయో ఉత్తరం సూతివత్స్యాత్
చాతుర్వర్ణ్యస్య సామ్యం భవతి వయసి యత్పోచ్యతే శౌచమాత్రమ్॥

వ్యాఖ్యానం:- శ్రీగణేశాయనమః.

శ్లో॥ నత్వా గణేశం వరదం । శారదాం గురు మాత్మనః।
ఆశౌచసంగ్రహ త్రింశచ్ఛ్లోక్యా వ్యాఖ్యాం కరోమ్యహమ్॥

తత్ర స్మార్తక్రమ ముల్లంఘ్య శ్లోకప్రసిద్ధక్రమ మనుసరన్ గర్భవిపత్తినిమిత్తాశౌచక్రమే ఆశౌచం ప్రతిపాదయతి షణ్మాసేతి. అస్యాయ మన్వయః – షణ్మాసాభ్యంతరేషు = మధ్యేషు, స్వపురుష నిహతే = భర్త్రన్యస్తే। గర్భమాత్రే = అపూర్ణావయవేగర్భే, వినష్టే = చ్యుతే. మాతా. జననీతన్మాససంఖ్యా సమదినం = తేషాం మాసానాం గర్భధారణా దారభ్య ప్రత్యేకం యా యా సంఖ్యా, తయా సమాని దినాని యస్మిన్ కాలే ఇతి మితి సమాసః, తథా చాయ మర్థః. గర్భ ధారణమాస మారభ్యకృత్వా యన్మాసాభ్యంతరే గర్భో వినష్టో తన్మాస సంఖ్యయా సమదినా సీతి. అత్ర యద్య ప్యవిశేషేణోక్తం తథాపి చతుర్థమాసమారభ్య షణ్మాసపర్యంతం ద్రష్టవ్యం. ఆద్యేమాసత్రయేచ విశేషేణ త్రిరాత్రమేవ మాతుః సపిండానాంతు నాశౌచం॥

తథాచ మరీచిః — శ్లో॥ గర్భస్రుత్యాం యథా మాస మచిరే తూత్తమే త్రయః ఇతి॥ అచిరే = అద్యేమాసత్రయే. ఉత్తమే = బ్రాహ్మణ జాతౌ, త్రయో దివసాః అశౌచహేతవః స్యుః. మాసత్రయే, త్ర్యహా మితి గౌతమ నోక్తేః॥

స్మృత్యంతరేపి:. స్రావే మాతుః త్రిరాత్రం స్యాత్। సపిండాశౌచ వర్జనమితి॥ మాతు శ్చతుర్థే చతూరాత్రం, పంచమే పంచరాత్రం, షష్ఠే షడ్రాత్ర మితి. ఏవం మాతు రాశౌచ మభిధాయ సపిండా స్సప్తపురుషావసానాః। స్నానేన శుద్ధా స్స్యుః। సద్య శ్శౌచం సపిండానాం గర్భస్య పతనే సతీతి స్మరణాత్, ఏవం సపిండానాం చతుర్థమాసాదిత్రయే అవిశేషేణ సద్య శ్శౌచే ప్రాప్తే పంచమషష్ఠయో ర్విశేషమాహ అంత్యఇతి॥ షణ్ణాం మాసానాం మధ్యే యదంత్యమాసద్వయం, పంచమషష్ఠాఖ్యం తత్ర సపిండా స్త్రిదిన మశుచయ స్స్యు రితి సంబంధః॥ శ్లో॥ పాతే మాతు ర్యథా మాసం। పిత్రాదీనాం దినత్రయ మితి స్మృతేః॥ అత్రపాతః పంచమషష్ఠయో రితి వచనాత్। పాతశబ్దః పంచమషష్ఠమా సోపలక్షణ పరః। అతః షణ్మాసా దూర్ధ్వం సప్తమాష్టమమాసయోః సూతివ త్స్యాదాశౌచ మితి శేషః. సూతిః, ప్రసవః, జననం. తత్రేతి సూతిపత్స్వి సపనిమిత్తం దశాహం, నాన్యనిమిత్తమితియావత్. సూతే దశాహాశౌచ నిమిత్తతా. శ్లో॥ దశాహం శావ మాశౌచం సపిండేషు విధీయతే। జననే ప్యేవ మేవస్యా న్నిపుణాం శుద్ధి మిచ్ఛతా మితి మనూక్త్యా ప్రసిద్ధా. తథాచ స్మృతిః — శ్లో॥ షణ్మాసాభ్యంతరే యావ ద్గర్భస్రావో భవే ద్యదా। తదా చతుర్ణాం వర్ణానాం సామ్యం సాధారణం భవతి॥ నాత్ర కల్పన వర్ణకృతో విశేషః న కేవల మిదమేవ సామ్యం. వయోవస్థావిశేషోపరనిమిత్తమపి త్యాహ వయసీతి। యద్వయోవిశేషోపరతినిమిత్తాశౌచం, వర్ణ విశేషోపాదానరాహిత్యేన విహితం. తదపి చాతుర్వర్ణ్యస్య సామ్యం భవతి॥ గర్భగ్రహణమసా దారభ్య ప్రసవపర్యంతం, ప్రసవమారభ్యోపనయన

పర్యంతం చావస్థావిశేషపురస్కారేణ. యదాశౌచ మభిహితం వక్ష్య
మాణంచ, తదుక్తం వ్యాఘ్రపాదమునినా - శ్లో॥ తుల్యం వయసి సర్వేషా
మతిక్రాంతే తథైవ చేతి॥ అత్ర స్వపురుషనిహిత ఇత్యనేన, పరపురుష
నిహితే, జననవ్యతిరిక్తానా మాశౌచాభావో ధ్వనితః॥

తా. ఆరుమాసములలోపల తనభర్తచే గర్భించబడినట్టియు, అవయవములు పూర్తిగానట్టియు, గర్భము నష్టమైనచో మొదటిమూడు మాసములలో నెప్పుడు నష్టమైనను తల్లికి మూడుదినము లాశౌచము, "మాసత్రయే త్ర్యహమ్" అని గౌతములవా రుచ్చరించుటవలన సపిండుల కాశౌచము లేదు. తల్లికి 4 వ మాసమందైనచో 4 దినములును, 5 వ మాసమందైనచో 5 దినములును, 6 వమాసమందైనచో 6 దినములును ఆశౌచము. 4 వ మాసము వెళ్లుపరకును స్రావమని పేరు. 5, 6 మాసములయందైనచో పాత మని పేరు. స్రావమందు జ్ఞాతుల కాశౌచము లేదు. పాతమైనచో సపిండులకు 3 దినములు జాతాశౌచము (ఇది యాచరణలో లేదు) 7 వ మాసము మొదలు ప్రసవముతో సమానము. 4 వర్ణములవారికిని జాతాశౌచము 10 దినములే 'స్వపురుషనిహితే' అనుటచే పరపురుషనిహితమైనచో సపిండులకు జాతాశౌచాభావము ధ్వనించుచున్నది.

అవ. పూర్ణప్రసవనిమిత్తాశౌచం వివృణ్వాన్ కాలభేదేన ఆశౌచభేదమాహ -

2. జన్మాశౌచాంతరాళే యది శిశునశనం స్యాత్ప్రవృద్ధ్యార్ధ్వకాలే
నిష్ప్రాణో నిష్పతే ద్వా జననజనిత మాశౌచ మస్త్యేవ కృత్స్నం
ప్రాఙ్నాభిచ్ఛేదనా చ్చే త్స్వనిధన ముపగత స్తత్త్ర్యహేణైవ శుద్ధి
స్సర్వేషాం సూతికాయాః స్త్వహ సకలకం ప్రేతశుద్ధి స్తు సద్యః॥

వ్యాఖ్యానం - ఇదానీం పూర్ణప్రసవనిమిత్తాశౌచం ద్వితీయవృత్తే
నాహ జన్మేతి. జన్మాశౌచాంతరాళే = జన్మాశౌచమధ్యే! నాళవృద్ధ్యా

ర్ధ్వకాలే = నాళచ్ఛేదనానంతరం । యది శిశో ర్నశనం = ఉపరమః । స్యాత్। వా = అథవా । నిష్ప్రాణః = ప్రాణరహితో । నిష్పతేత్ = నిర్గచ్ఛేత్। తదా। జననజనితం = జన్మనిమిత్తం, ఆశౌచమ్, కృత్స్నం = పూర్ణం అస్త్యేవ, న, శావాశౌచేన జననాశౌచనివృత్తిః। కింతు జన్మాశౌచే నైవ । శిశూపరమనిమిత్తాశౌచనివృత్తి రితి భావః. తదుక్తం బృహన్మనునా - శ్లో॥ దశాహాభ్యంతరే బాలే । ప్రమీతే తస్య బాంధవైః। శావాశౌచం న కర్తవ్యం । సూత్యాశౌచం విధీయత ఇతి॥ యదిచే జ్జననాదనంతరం నాళచ్ఛేదనాత్ప్రా జ్నిధన ముపగతః, తర్హి సర్వేషాం పిత్రాదీనాం త్ర్యహేనైవ శుద్ధిః స్యా దితి శేషః । ఇహచ విషయే, సూతికాయాః = మాతుస్తు, సకలం = సంపూర్ణం. దశాహం, ప్రసవ నిమిత్తం స్యాత్। శావశుద్ధి స్తు సద్యః. ప్రసవ నిమిత్త మేవ భవతి న శావ మితి భావః। శ్లో॥ జీవన్ జాతో యది తతో మృత సూ్తతక ఏవతు సూతకం సకలం మాతుః పిత్రాదీనాం త్రిరాత్రక మితి॥ శ్లో॥ యావన్నచ్ఛిద్యతే నాళం తావ న్నాప్నోతి సూతకమ్ । ఛిన్నే నాళే తతః పశ్చా త్సూతకం తు విధీయతే ఇతి వచనాత్॥

తా. పూర్ణప్రసవాశౌచమును ద్వితీయవృత్తముచే చెప్పుచున్నాడు, జన్మాశౌచమధ్యమునందు నాభిచ్ఛేదనమైనపిమ్మట, శిశువు మరణించి నను, లేదా ప్రాణములేక జన్మించినను జాతాశౌచము పూర్తిగా కలదు, మృతాశౌచముచే జననాశౌచము నివృత్తి కాదు. జన్మాశౌచముచేత నే శిశువు యొక్క మృతాశౌచము నివృత్తి యగును. జననమైనపిమ్మట, నాభిచ్ఛేద నాత్పూర్వము మరణించినచో తండ్రిమొదలగు సపిండులందరకును 3 రోజులతోనే శుద్ధియగును, తల్లికిమాత్రము 10 దినములు ప్రసవాశౌచము కలదు. మృతాశౌచము వెంటనే నివృత్తి యగును, తల్లికి 10 దినములు జాతాశౌచమును, పిత్రాదులకు 3 దినములు జాతాశౌచమును కలదు,

ధర్మసింధుసారే అతిక్రాంతజాతాశౌచప్రకరణమ్

వాక్యం:- జననే అతిక్రాంతాశౌచం నాస్తి। పితురపత్యజననశ్రవణే, దేశాంతరే, కాలాంతరే, స్నానం భవత్యేవ॥

తా. జననమున కతిక్రాంతాశౌచము లేదు. తండ్రి మాత్రము తనకు సంతతికలిగిన దని వినినచో, నెంతకాలమునకైనను, దేశాంతరమునందైనను స్నానము చేయవలెను.

పితృగృహే కన్యాప్రసూతౌ

పిత్రోస్తద్గృహవర్తిజ్ఞాతీనాం చైకాహః। పితృగృహవర్తి పితృవ్యాదీనాం సర్వేషాం పితృసపిండానా మేకాహ ఇతి। స్మృత్యర్థసారే। ఏవం భ్రాత్రాదిగృహే భగిన్యాదిప్రసవేపి తేషా మేకాహః. మాధవీయే పితృగృహే కన్యాయాః ప్రసూతౌ పిత్రో స్త్రిరాత్రమ్. తద్గృహవర్తి భ్రాతౄణా మేకాహ ఇత్యాహ, కన్యాయాః పతిగృహే ప్రసవే పిత్రాదీనాం నాశౌచమ్॥

తా. తండ్రియింట కన్యక ప్రసవించినచో తల్లిదండ్రులకును ఆగృహమందలి జ్ఞాతులకును ఒకరోజు జాతాశౌచము. తండ్రియింటియందలి పినతండ్రి పెత్తండ్రులకును, పితృసపిండులకును ఒకరోజు జాతాశౌచమని స్మృత్యర్థసారమునందు చెప్పబడినది. అట్లే సోదరునింట సోదరి ప్రసవించినను, భ్రాత్రాదుల కొకదిన మాశౌచము. మాధవీయమునం దిట్లు చెప్పబడెను. తండ్రిగృహమందు కన్యక ప్రసవించినచో తల్లిదండ్రులకు 3 దినములు జాతాశౌచము. ఇంటియందున్న సోదరుల కొకదినము జాతాశౌచము కలదు. కన్యక భర్తయింట ప్రసవించినచో తండ్రిమొదలగువారి కాశౌచము లేదు.

నోటు:- ఇది యాచరణలో లేదు. తండ్రియింట ప్రథమమున కన్యక ప్రసవించి, మగపిల్లవాడు కలిగినచో తల్లిదండ్రులకు 3 దిన

ములు జాతాశౌచము కొన్నిస్థలముల నాచరణలో గలదు. ఆడుశిశువు కలిగినచో నాశౌచము లేదు. సోదరులకును అశౌచము లేదు. ఇది శిష్టాచారము.

స్మృతిముక్తాఫలే విశేషః స్మృతః:-

శ్లో॥ యది కన్యా పితుర్గేహే। పుమాంసం జనయే త్తదా।
త్రిరాత్రం సూతకం పిత్రోః। కన్యాసూతాతు పక్షిణీ॥

తా. కన్యక తండ్రియింట కుమారుని గనినచో తల్లిదండ్రులకు 3 దినములు జాతాశౌచమును, కుమార్తెను కనినచో పక్షిణి జాతాశౌచమును కలదు— ఇదియును శిష్టాచారము.

జాతాశౌచము సమాప్తము.

## అథ మృతాశౌచ విధిః

అవ. నామకరణ మారభ్య, ఉపనయనావధికాశౌచ మాహ-

3. స్నానం ప్రాఙ్నామతో ర్వాగ్దశనజననతో ఽహః పరేతేఽగ్నిదగ్ధే
ఽదగ్ధే త్వత్రాపి సద్య స్తదుపరి దినమా త్ర్యబ్దత శ్చౌలతో న్యే
పశ్చాచ్చేతు త్రిరాత్రం త్రిదిన మితరథా ప్యావ్రతా జ్జాత్యశౌచం
మాతాపిత్రోస్తు పుత్రే త్రిదిన మదశనే సన్నిధా నష్టదేష్టే॥

వ్యా:- ఏవం కాలవిశేషేణ దశాహాద్యాశౌచాపవాద మభిధాయ వయోవస్థావిశేషా దపి తదపవాదం తృతీయవృత్తే నాహ-స్నానం ప్రాగితి - నామకరణాత్ప్రాక్ = నామకరణా త్పూర్వం, పరేతే = ఉపరతే బాలే, స్నానం = స్నానమాత్రం. న తన్నిమిత్త మాశౌచం, ప్రాఙ్నామకరణా త్సద్య శ్శుద్ధి రితి శంఖస్మరణాత్. నామకరణా దూర్ధ్వం దశనజననతః = దంతజననాత్, అర్వాక్ = పూర్వం, ఉపరతే = ప్రేతే.

అగ్నిదగ్ధే. అహః = ఏకరాత్రం. యమః- శ్లో॥ అదంతజాతే తనయే శిశౌ గర్భమృతే తథా। సపిండానాంతు సర్వేషా మహోరాత్ర మశౌచకమ్॥ అహ స్త్వదత్తకన్యాసు బాలేషుచ విశోధన మితి యాజ్ఞవల్క్య వచనాత్- ॥అదగ్ధేతు, సద్య శ్శుద్ధిః = స్నానమాత్రం, ఆదంతజనా త్సద్య ఇతివచనాత్। తదుపరి దినమా త్ర్యబ్దిత శ్చౌలకూన్యే. తదుపరి = దంతోద్గమా దూర్ధ్వం యావ త్త్రివర్షం చూడాకరణరహితే పరేతే, దినం = ఏకాహం. ఆచూడా నైశికేస్మృతేతి వచనాత్, కృతచౌలేతు త్రిరాత్ర మిత్యాహ, సచౌలే = కృతచౌలే, పరేతే, త్రిరాత్రం నిర్వృత్య చూలకానాంతు త్రిరాత్రా చ్ఛుద్ధి రిష్యత ఇతి మనువచనాత్ వర్షత్రయానంతరం యావ దుపనయనం త్రిరాత్ర మిత్యాహ. త్రిదిన మితరథా ప్యావ్రతా దితి- ఇతరథా = అకృతచౌలే ఽపి సంస్థితే, తదుపరి = వర్షత్రయా దూర్ధ్వం ఉపనయనా త్ప్రాక్ త్రిరాత్రం. తథా చాయమర్థః- ప్రథమాబ్దే కృతచూడస్య యావదుపనయనం త్రిరాత్రం, వర్షత్రయా దూర్ధ్వ మకృతచూడస్యాపి యావ దుపనయనం త్రిరాత్ర మితి- త్రిరాత్ర మావ్రతాదేశా దితి వచనాత్॥ ఏవం వయోవస్థా విశేషే ఽశౌచ మభిధాయ జాత్యాశౌచ మాహ - జాత్యాశౌచ మితి- తదుపరి = ఉపనయనానంతరం, జాత్యాశౌచం = దశాహాదికమితి యావత్, దశరాత్ర మతఃపర మితి వచనాత్॥ ఏవ మవిశేషేణ జాతదంతమరణే మాతాపిత్రో రపి సద్య శ్శౌచాదిప్రాప్తౌ తదపవాద మాహ మాతాపిత్రోస్తు పుత్ర ఇత్యాదినా- అదశనే = అజాతదంతమృతే మాతాపిత్రో స్త్రిరాత్ర మేవ, బాలానా మజాతదంతానాం త్ర్యహా చ్ఛుద్ధి రితి కశ్యపవచనాత్॥ బైజికా దపి సంబంధా దనురుంధ్యా దఘం త్ర్యహ మితి, స్మృత్యంతరాచ్చ ఏతత్సర్వం "స్నానం ప్రాఙ్నామతో ర్వాగ్గశన జననాత్ ఽహః పరేతే" ఇత్యాది నోక్తం. సన్నిధౌ శిశుమరణే వేదితవ్య మిత్యాహ సన్నిధౌ నష్టచేష్ట ఇతి- సన్నిధౌ = సమీపే, సన్నిధౌ

శబ్దేనాత్ర యత్రస్థే నాశౌచకాలమధ్యే శ్రూయతే స సష్టా, చేష్టా, యస్మిన్ మృత ఇతి యావత్. అసన్నిధౌతు శిశుమరణే అతిక్రాంతాశౌచ మేతన్న భవతీతి భావః. తదుక్తం వ్యాఘ్రపాదమునినా - ఉపనీతేతు విషమం తస్మిన్నేవాతికాలజ మితి॥

తా. కాలవిశేషముచేత దశాహాము మొదలగు నాశౌచాపవాదమును చెప్పి, వయోవస్థావిశేషమువలనను దశాహాశౌచమున కపవాదమును 3 వ వృత్తముచే చెప్పుచున్నాడు. శిశువు నామకరణముకాకముందు మరణించినచో స్నానమాత్రము చాలును. ఆశౌచము లేదు, నామకరణమునకు ముందు సద్యశ్శుద్ధి యనిశంఖవచనము. నామకరణానంతరము దంతోత్పత్తికాకపూర్వము శిశువుమరణించినచో దహనమైనచో జ్ఞాతుల కొకదిన మాశౌచము; ఖననమైనచో స్నానముతో శుద్ధియగును. దంతోత్పత్తియైనపిమ్మట 3 సంవత్సరములు వెళ్లువరకును చూడాకర్మ జరుగక మరణించినచో ఒకదిన మాశౌచము. చూడాకర్మ జరిగినపిమ్మట మరణించినను 3 సం॥లు దాటినపిమ్మట ఉపనయన పర్యంతమును 3 దినములాశౌచము. మొదటిసంవత్సరములో చూడాకర్మ చేసినను, ఉపనయనపర్యంతము త్రిరాత్రము. 3 సం॥లు దాటిన పిమ్మట చూడాకర్మ చేయకపోయినను ఉపనయనపర్యంతము త్రిరాత్రము. ఈవిధముగా వయోవస్థావిశేషముచేత నాశౌచమును చెప్పి జాత్యాశౌచమును చెప్పుచున్నాడు. ఉపనయనానంతరము బ్రాహ్మణాది జాతులకు దశాహాద్యాశౌచము విధించబడినది. దంతములు రాకముందు మరణించినను, తల్లిదండ్రులకు 3 రోజులు మృతాశౌచము గలదు. అసన్నిధియందు మరణించినచో, మూడురోజులలోపల వినినచో తల్లి దండ్రులకు శేషముతో శుద్ధియగును. త్రిరాత్రానంతరము వినినచో నతిక్రాంతాశౌచము లేదని భావము. స్నానముతో శుద్ధియగును.

## పుత్రీపుత్రయో రాశౌచభేదః

4. ఊనద్వ్యబ్దే త్వసంజ్ఞే జనికరజననీసోదరాణాం దశాహమ్
యద్వాఽస్పృశ్యత్వమేవాధిక మహవిషయేఽశౌచకం తు త్రిరాత్రమ్
స్త్రీషు స్నానేన శుద్ధ్యే త్త్రిపురుషవిషయే జ్ఞాతి రాచౌరకాలా
దర్వాగ్వాగ్దానతోఽహ్నా త్రిభి రుపయమనా ద్భర్తృగోత్రం స్వకం చ॥

అథ చతుర్థవృత్తమ్ - తత్రాద్యపాద స్యాయ మర్థః - జనన ఊర్ధ్వం॥ ఊనద్వ్యబ్దే = అపూర్ణద్వివర్షే. అసంజ్ఞే = మృతసంజ్ఞే, మృత ఇతి యావత్. జనికరః = పితా, జననీ = మాతా, సోదరాః = భ్రాతరః తేషాం దశాహమాశౌచ మిత్యేకః పక్షః॥ గర్భస్థే ప్రేతే మాతు ర్దశాహం జాతే ఉభయోః కృతే నామ్ని సోదరాణా మితి పైంగ్యవచనాత్॥ పక్షాంతర మాహ యద్వేతి - అథవా పిత్రాదిత్రయస్య త్రిరాత్రాశౌచే అస్పృశ్యత్వ మేవాధికమ్. తత్ర పక్షే సూతకం కర్మానధికారిత్వ లక్షణమ్. త్రిరాత్రం ఇతర సపిండాపేక్షయా సపిండైస్సహ సమాన మితి భావః. ఏతచ్చ పక్షద్వయం, త్రిరాత్రం, దశరాత్రం వా శౌచా శౌచ మిష్యతే. ఊనద్వివర్ష ఉభయోః సూతకం మాతురేవహీ త్యేత ద్వ్యాఖ్యానసమయే విజ్ఞానేశ్వరాచార్యైస్స్పష్టీకృతం. అథ స్త్రీషు వయోవస్థావిశేషా దాశౌచవిశేష మాహ కరో త్యుత్తరార్ధేన స్త్రీష్వితి - నామకరణా దూర్ధ్వం చౌరకాలా దర్వాగ్యావత్. చౌరకాలం, మృతాసు స్త్రీషు = కన్యాసు, త్రిపురుషవిషయే = యావత్త్రిపురుషం, యో జ్ఞాతిః స్నానమాత్రేణ శుద్ధ్యేత్. అత్ర త్రిపురుష ఇత్యనేన కన్యానాం సాపిండ్యం త్రైపురుషం, అప్రత్తానాంతు స్త్రీణాం త్రిపురుషాహి జ్ఞాయత ఇతి వసిష్ఠోక్త మభిమతం, ఏతచ్చ సద్యశ్శౌచ మచూడాయాం. కన్యాయాం సద్యశ్శౌచం విధీయత ఇత్యాపస్తంబోక్తం జ్ఞేయం. చూడా కరణాదనంతరం వాగ్దానాదర్వా గహ్నా = ఏకాహేన. జాతిః శుద్ధ్యే దితి

పూర్వేణసంబంధః. అహ స్వదత్తకన్యాసు బాలేషుచ విశోధన మితి స్మర ణాత్. త్రిభిరుపయమనాత్ = వాగ్దానాదూర్ధ్వం, ఉపయమనాత్ = వివాహా దర్వాగ్భర్తృః పరిణేతుః గోత్రం, స్వకంచ = పితుర్గోత్రంచ, త్రిభి ర్దినైః శుధ్యేత్. ఇయంచ శుచిః స్త్రీణా మసంస్కృతానాంతు త్ర్యహా చ్ఛు ధ్యంతి బాంధవాః । యథోక్తే నైవ కల్పేన శుధ్యంతితు సనాభయ ఇతి మనూక్త్యా వేదితవ్యా॥

తా. నాల్గవవృత్తము మొదటిపాదమున కర్థమును చెప్పుచున్నాడు- శిశువు జన్మించినపిమ్మట రెండుసంవత్సరములు నిండకపూర్వము మర ణించినచో తల్లి, తండ్రి, సోదరులకు దశరాత్రాశౌచము కలదని యొక పక్షము. గర్భమందే మరణించినచో తల్లికి పదిరోజు లాశౌచము; పుట్టినపిమ్మట చనిపోయినచో తల్లిదండ్రులకు పదిదినము లాశౌచము; నామకరణమైనపిమ్మట సోదరులకుగూడ దశరాత్రాశౌచము గలదని పైంగ్యవచనము. పక్షాంతరమును చెప్పుచున్నాడు - అట్లుకానిచో తల్లి, తండ్రి, సోదరులకు త్రిరాత్రాశౌచమునందు తాకరాకుండుటయే- అధికము ఆపక్షమందు కర్మ కధికారములేని లక్షణముగ త్రిరాత్రసూతకము. ఇతర సపిండాపేక్షచేతను సపిండులతోగూడ సమానమని భావము. ఈ రెండు పక్షములున్నూ త్రిరాత్రముగాని, దశరాత్రముగాని మృతాశౌచము విధించబడినది. 'ఊనద్వివర్ష ఉభయో స్సూతకం మాతు రేవహి' అనెడు వ్యాఖ్యానసమయమందు విజ్ఞానేశ్వరాచార్యులచే స్పష్టీకరించబడినది. అనంతరము ద్వితీయార్థముచే స్త్రీలవిషయమై వయోవస్థావిశేషపూర్వక ఆశౌచము నావిష్కరింపజేయుచున్నాడు - నామకరణానంతరము 3సం. పూర్తియగువరకును స్త్రీలు మరణించినచో త్రిపురుషపర్యంతము అనగా తండ్రి, తాత, సోదరులు స్నానముతోశుద్ధియగును. చూడాకర్మవరకును కన్యకలకు సద్య శ్శౌచము అను నాపస్తంబోక్తివలన చూడాకర్మానంత

రము వాగ్దానమువరకును జ్ఞాతుల కొకదిన మాశౌచము. వాగ్దానానంత
రము వివాహమువరకు భర్తృజ్ఞాతులకును, పితృజ్ఞాతులకును త్రిరాత్ర
శౌచము.

నోటు:- ఈ వృత్తములో పైనచెప్పిన విషయము లిప్పు డాచర
ణలో లేవు.

అభినవషడశీత్యాం - 60 వ పుటే -

శ్లో॥ అనూఢాచే ద్రజః పశ్యే। ద్దశాహం తన్మృతౌ భవేత్॥

తా. కన్యక వివాహితురాలుగాకపూర్వము, రజస్వలయైనపిమ్మట
మరణించినచో జ్ఞాతులకు దశాహాశౌచము గలదు.

నేదినూరు వాస్తవ్యు లగు బ్రహ్మశ్రీ గొర్తి సూరయ్యగారిచే
వ్రాయబడిన ధర్మసంగ్రహబోధినియందు 5 వ పేజీలో నిట్లు వ్రాయబడి
వది - పురుషుడు 3 సం॥లు దాటినపిమ్మట ఉపనయనపర్యంతము-అనగా
ప్రత్యక్షోపనయన పర్యంతము - ఈలోపున పోతే జ్ఞాతులకు 3 రోజులు
మృతాశౌచము. తల్లిదండ్రులకును 3 రోజులు. ఇది త్రిరాత్రాశౌచమని
పేరుగలది. పక్షిణీదార్ల కాశౌచము లేదు - 'త్రిరాత్ర మాత్రతాదేశాత్'
అనుటచేత.

నోటు:— మృతతిథిలగాయతు 3 రోజులలోపల వింటే మిగి
లినభాగ మాశౌచము పట్టవలెను. 3 రోజులు దాటినచో నతిక్రాంతాశౌ
చము లేదు. త్రిరాత్రాశౌచ మనునది జ్ఞాతులకును, త్రిరాత్రపక్షిణీ
యనగా (ఆత్మ) బంధువులకు నని గ్రహించవలెను.

ఇచ్చట శాస్త్రము రెండువిధములుగ నున్నది. ఉపనయన
కాలము 8 సం॥లు నియతము గనుక, అంతకు లోపయితే 3 రోజు
లాశౌచమనియు, 8 సం॥లు దాటినచో 10 దినము లాశౌచమనియు,

కర్మ. సంస్కార మనియు కొందఱు ధర్మకర్త లభిప్రాయపడినారు - 'ఆదంత జన్మనః.'

నిర్ణయసింధౌ 368 పుటే - 'ఉపనయనాభావేపి అష్టమా దూర్ధ్వం అపూర్ణ మే వాశౌచం' అను శ్లోకమునందు కొన్నిటికి నియతకాలముల చెప్పి. ఉపనయనమునకు మాత్రము ప్రత్యక్షోపనయన మేమి? యని వారు హేతువు చెప్పిరి. కాలవిలంబము మతాంతరములయందు చెప్ప బడుటచే ప్రత్యక్షోపనయనమే అనగా యజ్ఞోపవీతధారణమే కావలెనని కొందర భిప్రాయపడిరి. శాస్త్రవికల్ప మున్నది - గౌతమీదక్షిణదిగ్భాగ మందలి శిష్టాచారము ప్రత్యక్షోపనయనమును పురస్కరించుకొని జరుగుచున్నది. గౌతమికి ఉత్తరభాగమందు వయస్సునుబట్టి యాచారము జరుగుచున్నది, అది మన కాచరణలో లేదు. 8 సం॥ల వరకు జ్ఞాతులకు స్నానముతో సరి, తల్లిదండ్రులకు 3 దినము లాశౌచము. 8 సం॥లు దాటినచో దహన సంస్కారము, కర్మ శాస్త్రమందు చెప్ప బడినవి. జ్ఞాతులు 3 రోజులు, తల్లిదండ్రులు 10 రోజులు ఆశౌచము పట్టుట ఆచరణ గలదు.

షడశీత్యాం 32 పుటే:-
ఇదం చానుపనీతే మరణాశౌచం సంస్కారప్రభృత్యేవ॥

ఉపనయనము లేనపిమ్మట మృతినొందితే జ్ఞాతులకు సంపూర్ణ మృతాశౌచము 10 దినములు. ఇప్పటినుండియే పక్షిణ్యాదులకు పక్షిణి.

కన్యక జన్మించిన 10 రోజులు దాటి, 3 సం॥ల వయస్సులోపల పోతే జ్ఞాతులకు తత్కాలశుద్ధి - స్నానము చేయవలయును. తల్లిదండ్రులకు 3 రోజులు. పక్షిణ్యాదుల కేమి లేదు (స్నానమాత్రము).

కన్యక 3 సంవత్సరములవయస్సుదాటి, వివాహము లోపున పోతే తల్లిదండ్రులకు 3 రోజులు. ఆ జ్ఞాతుల కేకదిన మాశౌచము గలదు.

ఒకరోజు దాటితే లేదు. విన్నది లగాయతు కాదు. శ్లో॥ మరణం కన్యకాయాశ్చ । ద్వావద్వర్షాత్రయావధి । సద్య శ్శుద్ధి స్సపిండానాం । తదూర్ధ్వే మహా రేవతు॥

పురుషులవిషయం - ఉపనయనంలోపు పోతేనున్నూ, స్త్రీలకు వివాహం లోపు పోతేనున్నూ పక్షిణీవార్లకు పక్షిణి లేదు. జ్ఞానులకు 1రోజని, 3 రోజులని, 10 రోజులని ఆశౌచ మని పేరు. ఆయా కాలము లోనే ముగింపు. పక్షణి విన్నది లగాయతు (10 రోజులలోపుననే).

పక్షిణి యనగా 90 ఘడియలు - రెండు పగళ్ళు ఒకరాత్రిగాని, రెండు రాత్రులు ఒక పగలుగాని,

అభినవషడశీత్యాం ౪౫ పుటే:—

శ్లో॥ పక్షిణీ యోనిదంధూనాం నాతికాలేన సూతకే ।
నోపనీతే రథః పుంసాం న పాణిగ్రహణాత్ స్త్రియః॥
అమరకోశే:- ఆగామివర్తమా నాహ । ర్యుక్తాయాంనిశి పక్షిణీ॥

ఇచ్చట నాచారభేదము గలదు- పగటికాలములో వింటేనే మరునాటి సాయంకాలములో శుద్ధియని - యిచ్చటివారి యాచారము. రాత్రి భాగములో వింటే ఆ 30 గడియలు లెక్కలేదని, మరునాటి ఉదయం లగాయతు 90 గడియ లని గౌతమీదక్షిణదిగ్భాగములో నాచారములో నున్నది. ఇందుకు ప్రమాణవాక్యం దొరకలేదు. రాత్రి వింటే రాత్రి 30 గడియలు, మరునాటి పగలు 30 ఘడియలు, మరునాటిరాత్రి 30 గడియలు. ఇందుకు ప్రమాణము గలదు. చాలచోట్ల ఆచారము గలదు. ఇచ్చట ఆచారము లేదు (కృష్ణాతీరమందు నాచారము గలదు).

వైద్యనాథదీక్షితేయే 82 పుటే నిర్ణయసింధౌచ:-

"ఏవం రాత్రే ర ప్యుపలక్షణం"

ఈపక్షిణివిషయములో నింకొకవిశేషము గలదు. మృతక్షణ కాలములగాయతు 90 గడియలకాలములో నింటనే పక్షిణి పట్టవలెననియు, ఆకాలము దాటితే లేదనియు ఒకపక్షము. ఇది యీప్రాంతమందు అనగా కోనసీమలో ఆచరణము లేదు. గౌతమీ ఉత్తరదిగ్భాగమందును, కృష్ణామండలమునందును ఆచరణము గలదు.

శ్లో॥ అతీతే పక్షిణీకాలే దశాహాభ్యంతరే యది। దివా వా యది వా రాత్రౌ వేకకాలేన శుధ్యతి॥ పక్షిణీ యోనిబంధూనాం నాతికాలేనసూతకే॥ ఇట్టి ప్రమాణము లున్నవి. ఈప్రాంతమందు అనగా గౌతమీదక్షిణదిగ్భాగమందు మృతదినములగాయతు 10 రోజులమధ్య ఎప్పుడువిన్నను విన్నదిలగాయతు 90 గడియలకాలము పక్షిణి పట్టుచున్నారు. వైద్యనాథదీక్షితీయే స్మృతిముక్తాఫలే 98 పుటే, యత్తు "అతీతే పక్షిణీ కాలే ..., ఏకకాలేన శుధ్యతీతి" స్మృత్యంతరే సంగ్రహకారేణప్రమాణ ముక్తం. ఇందుకు ప్రమాణమున్నూ గలదు. రెండువిధముల శాస్త్రమున్నపుడు "యే నాస్య పితరో యాతా యేన యాతాః పితామహాః" అనగా మన తండ్రి తాత లేవిధమున నడచిరో మనము నాపథమునే గ్రహింపవలెనని యున్నది. అదియును శాస్త్రసిద్ధమైన సత్ప్రవర్తనలోనే నని యోచించవలెను. తథాపి విజ్ఞానేశ్వరమాధవీయాది నిబంధనేషు, మన్వాదిషు చాదర్శనా ద్విచారణీయం॥

ఈపక్షిణి యనునది సన్నిధియనియు, అసన్నిధి యనియు రెండు రకములు. సన్నిధి యనగా ప్రాణోత్క్రమణసమయం దాగ్రామము నాల్గుపొలిమేరలమధ్యనుండుట. అసన్నిధి యనగా నాసమయమున నాగ్రామములో లేక మరియొకచోట నుండుట.

ఈ పక్షిణిపట్టవలసినబంధువు లెవరనగా—సపిండులు కానివారు అనగా జ్ఞాతులు కానివారు, యోనిసంబంధులు మూడుపురుషులవరకు.

వైద్యనాథదీక్షితీయ స్మృతిముక్తాఫలే 83 వ పుటే - పక్షిణీ మసపిండ యోనిసంబంధే ఆత్రిపూరుష మితి.

ఆస్తికుల కొరకు మనవి

మనుస్మృతి 45 పేజీ 2 వ అధ్యాయం 36 వ శ్లోకం —

శ్లో॥ గర్భాష్టమేబ్దే కుర్వీత। బ్రాహ్మణస్యోపనాయనం।
గర్భాదేకాదశే రాజ్ఞో। గర్భాత్తు ద్వాదశే విశః॥

తా. బ్రాహ్మణునకు 7 వ సంవత్సరమునను, క్షత్రియునకు 10 వ సంవత్సరమునను, వైశ్యునకు 11 వ ఏటను ఉపనయనము చేయవలెను.

శ్లో॥ ఆషోడశా ద్బ్రాహ్మణస్య। సావిత్రీ నాతివర్తతే।
ఆ ద్వావింశాత్ క్షత్రబంధో। రాచతుర్వింశతే ర్విశః॥

తా. బ్రాహ్మణునికి 15 వ సంవత్సరము వెళ్లువరకును, క్షత్రియునికి 21 వ సంవత్సరము వెళ్లువరకును, వైశ్యునికి 23 వ సంవత్సరము వెళ్లువరకును గాయత్రి నశింపదు.

కుల్లూకభట్టవ్యాఖ్యాయాం యమః —

శ్లో॥ పతితా యస్య సావిత్రీ। దశవర్షాణి పంచచ
బ్రాహ్మణస్య విశేషేణ। తథా రాజన్యవైశ్యయోః॥
ప్రాయశ్చిత్తం భవే దేషాం। ప్రోవాచ వదతాంపరః।
వివస్వత స్సుత శ్శ్రీమాన్। యమో ధర్మార్థతత్త్వవిత్॥
సశిఖం వపనం కృత్వా। వ్రతం కుర్యా త్సమాహితః।
హవిష్యం భోజయే దన్నం। బ్రాహ్మణాన్ సప్తపంచవా॥

తా. 15 సంవత్సరములు వెళ్ళి సావిత్రి పతితయైనవానికి యమధర్మరాజు క్రిందివిధముగా ప్రాయశ్చిత్తమును విధించెను. శిఖతో కూడ వపనముచేయించి వ్రతము నాచరించవలెను. హావిష్యమును

భుజింపవలెను. 7 లేక ౦ గురు బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. క్షత్రియవైశ్యులుకూడ 21, 23 సంవత్సరములు వెళ్ళినపిమ్మట పైవిధమున నాచరించి యుపనయనము చేసికొనవలెను.

శ్లో॥ అతఊర్ధ్వం త్రయో ప్యేతే, యథా కాల మసంస్కృతాః।
సావిత్రీ పతితా వ్రాత్యా। భవం త్యార్యవిగర్హితాః॥

తా॥ అంతకు పిమ్మట నీబ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు కాలము నతిక్రమింపక యుపనయనము చేయబడనివారై గాయత్రినుండి భ్రష్టులై, శిష్టులచే నిందితులై వ్రాత్యు లనబడుదురు.

శ్లో॥ నైతై రపూతై ర్విధివ। దాపద్యపిహి కర్హిచిత్।
బ్రాహ్మాన్ యౌనాంశ్చ। సంబంధా న్నాచరే ద్బ్రాహ్మణస్సహ॥

తా॥ ఇట్టి యపవిత్రులై, యథావిధి వ్రాత్యప్రాయశ్చిత్తము చేసికొననివారితో బ్రాహ్మణు డాపదలందుగూడ నెప్పుడుకాని, యాజనాదిబ్రాహ్మణసంబంధములను, కన్యాదానాదివరసంబంధములను చేయరాదు.

కావున నోద్విజోత్తములారా! పైన వివరించినవిధముగా మనుస్మృతియందు బ్రాహ్మణాదివర్ణములవారికి ఉపనయనకాలము నిర్ణయింపబడినది. కనుక బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు వారికి సకాలమగు 7, 10, 11 సంవత్సరములు దాటకముందే ఉపనయనసంస్కారము నాచరించుటకు ప్రయత్నింపుడు. అట్లుకానిచో, గౌణపక్షమగు 15, 21, 23 సంవత్సరము లతిక్రమించకముందైనను ఉపనయనము తప్పక చేయుడు. కర్మముజాలక, అసందర్భముచే గౌణకాలముగూడ నతిక్రమించినచో కుల్లూకభట్టవ్యాఖ్యానములో యమధర్మరాజు వివరించినట్లు వ్రాత్యప్రాయశ్చిత్తమునైన నాచరించి పిమ్మట నుపనయనముజేయుడు.

యుపనయనముచేయమనిగాని.
మావాడు బి. ఏ. ప్యాసైనగాని వివాహమునాడే ఉపనయనపుమొక్క
ఉపనయనము వివాహాంగముగదా వివాహమునాడే ఉపనయనము ముఖ్య, గౌణ కాలము
తీర్చికొనవచ్చునెమ్మనిగాని యశ్రద్ధచేసి, చేయబూనకుడు. 7 దినములు
వెళ్ళబుచ్చి. కుమారులను వ్రాత్యులను మరల నుపనయనము చేసి
సంధ్యావందనము నాచరింపనిచో ద్విజులు, శూద్రతుల్యులగుదురనియు
కొనవలెననియు, నటు లాచరించనిచో నుపనయనమైనపిమ్మట మానవ
స్మృతులు ఘోషించుచున్నవిగాన
లచే ప్రతిదినమును సంధ్యావందనము నాచరింపజేయుడు.

## చాతుర్వర్ణ్యాశ్రమాశౌచభేదః

5. జన్మన్యోపేతమృత్యా వపిచ దశవిశా ద్వాదశాహాని పక్షం
మాసం వర్ణాః క్రమే ణాశుచయ ఉచితకృ చ్ఛూద్రజాతిస్తు పక్షం
వానప్రస్థే యతౌ చోపరమతి కులజే షండకే చాప్లవ స్స్యాత్
యోషిద్గో విప్రగుర్వ్యో మృతవతిచ దినం యుద్ధవిద్ధేతు సద్యః॥

వ్యా. ఏవం చతుర్వర్ణసాధారణీం శుద్ధి ముక్త్వా వర్ణవిశేషేణ దశాహాశౌ చాపవాదం పంచమవృత్తపూర్వార్ధే నాహ - జన్మనీతి-

జన్మని = పూర్ణప్రసవే, ఉపేతః = ఉపనీతః, కృతోపవీత సంస్కారః॥ ఉపేత ఏవజోపేతః॥ తస్యమృత్యౌ = ఉపనీతాదిమరణేచ, బ్రాహ్మణాదయ శ్చత్వారో వర్ణాః క్రమేణ దశనిశాదికాల మశుచయ స్స్యుః॥ బ్రాహ్మణో దశాహం, క్షత్రియో ద్వాదశాహం, వైశ్యః పంచదశాహం, శూద్రో మాసం = పక్షద్వయ మితి క్రమః॥ ఉచితకృత్ = పాకయజ్ఞద్విజశుశ్రూషాదివిహితకర్మానుష్ఠానశీలః శూద్రః, పక్షం = పంచదశరాత్ర మేవ అశుచి, ర్నతు మాసం॥

శ్లో॥ త్రిరాత్రం దశరాత్రం వా। శావ మాశౌచ మిష్యతే।
క్షత్రస్య ద్వాదశాహాని। విశః పంచదశైవ తు।
త్రింశద్దినాని శూద్రస్య। తదర్ధం న్యాయవర్తినః॥

ఇతి యాజ్ఞవల్క్యస్మరణాత్ ఇదానీం ఉత్తరార్ధేన కులసంబంధి పురుషవిశేషోపరమే దశాహాద్యాశౌచాపవాద మాహ వానప్రస్థ ఇతి. కుతః—సర్వేషా మేవ వర్ణానాం సూతకే మృతకే తథా।
దశాహాచ్ఛుద్ధిరేతేషా మితి శాతాతపోఽబ్రవీత్ ॥

ఇతి టీకాంతరే ఉపాధివశా త్సంకోచః॥ కులజే = స్వవంశ్యే, వానప్రస్థే = తృతీయాశ్రమిణి। యతౌచ = చతుర్థాశ్రమిణి। షండకే = క్లీబేచ। ఉపరమితి = ఉపరతే। ఆప్లవః = స్నానమాత్రం, శుద్ధికారణ మితి॥ యోషిద్గోవిప్రగుప్త్యై = తద్రక్షణాయ, మృతవతి। దినం = అహోరాత్రం। ఆశౌచం। యుద్ధవిద్ధే = సాక్షా ద్యుద్ధహాతేతు। సద్యః = స్నానమాత్రేణ శుద్ధి రితి పూర్వేణ సంబంధః॥ యుద్ధఘాతేతు = కాలాంతరమృతేతు, దినమేవ శుద్ధిహేతుః॥

శ్లో॥ బ్రాహ్మణార్థే విపన్నా యే యోషితాం గోగ్రహేపివా।
ఆహవేచ హతానాంవా ఏకరాత్ర మశౌచక మితి స్మృతేః॥

శ్లో॥ ఉద్యతై రాహవే శస్త్రైః। క్షత్రధర్మహతస్య చ
సద్య స్సంతిష్ఠతే యజ్ఞ। స్తథాశౌచ మితి స్థితిః॥

ఇతి మనువచనాత్॥

తా. ఈవిధముగా నాలుగువర్ణములవారిసాధారణశుద్ధిని చెప్పి వర్ణవిశేషముచేతను, దశాహాశౌచముయొక్క అపవాదము పంచమవృత్తముయొక్క పూర్వార్ధముచేత చెప్పుచున్నాడు-

పూర్ణప్రసవమందును, ఉపనయనసంస్కారము జరిగిన ద్విజుడు

మరణించినపుడును బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యములవారు క్రమముగా 10, 12, 15, 30 దినములాశౌచము కలవారగుచున్నారు.

సప్తపాకయజ్ఞముల నాచరించిన బ్రాహ్మణులకు శుశ్రూషాది విహితకర్మానుష్ఠానకుశలుడైన సచ్ఛూద్రునికి 15 దినములాశౌచము 'తదర్ధం న్యాయవర్తినః' అను యాజ్ఞవల్క్యస్మరణమువలన.

ఉత్తరార్ధముచేత కులమునకు సంబంధించిన పురుషవిశేషుని యొక్క మరణమందు దశాహాద్యాశౌచాపవాదమును వివరించుచున్నాడు-

ఎందువలన ననగా అన్నివర్ణములవారికిని ప్రసవమందును మరణమందును 10 రోజులతోడనే శుద్ధియగునని శాతాతపుడు వచియించెను. ఇట్లని మరియొకటీకయందు ఉపాధివశమున సంకోచము చెప్పబడినది. తనవంశమందు జన్మించిన వానప్రస్థుడుగాని, యతిగాని, షండుడుగాని మరణించినచో స్నానముతో శుద్ధి యగును. స్త్రీలు, గోవులు, బ్రాహ్మణులు వీరి రక్షణార్థమై చనిపోయినచో స్నానముతో సరియగును. యుద్ధములో కొట్టబడి కాలాంతరమందు మరణించినచో ఒకరోజు ఆశౌచము గలదు. యుద్ధములో వెంటనే మరణించినచో స్నానముతో శుద్ధియగును.

దేశకాలవిభేదపూర్వ కాశౌచభేదః

(అతిక్రాంతాశౌచం)

6. శావేతీతే దశాహప్రభృతివిషయకే ప్రాక్ త్రిమాసా త్త్రిరాత్రం పక్షిణ్యా షణ్మాసా ద్దిన మిహ నవమా త్స్యా త్తతః స్నానమాత్రం స్నానం దేశాంతరస్థే త్వథ పితృవిషయే దేశకాలావిశేషాత్ స్వంస్వంమాతుస్సపత్న్యాశ్చ స్త్రీదిన మిద మతిక్రాంత్యశౌచం సమానమ్॥

వ్యా. ఏతత్ జ్ఞానమే వాశుద్ధినిమిత్త మితి వృద్ధై ర్నిర్ణీతమతో జ్ఞానానంతర ముత్సర్గతో దశాహాద్యాశౌచప్రాప్తౌ క్వచి ద్దేశకాలాదిభేదేన తదపవాదమాహ- శావేతీత ఇతి షష్ఠ్యవృత్తేన-

కావే = కావాశాచే । దశాహప్రభృతి = దశాహాదికే। అతీతే = అతిక్రాంతే । దశదినానంతరం జ్ఞాతే ఇతి యావత్ । విషయక ఇతి- యస్మిన్ దేశే మృతిః తత్రైవ జ్ఞాతే । త్రిమాసాత్ ప్రాక్ = ప్రథమ మాసత్రయే త్రిగాత్రం । త్రిమాసా దనంతరం ఆషణ్మాసాత్ = షణ్మాసంయావత్ । పక్షిణీ = పూర్వాపరదినాభ్యాం యుక్తా రాత్రిః । అశుద్ధినిమిత్తం । షణ్మాసా దూర్ధ్వం యావ న్నవమమాసపర్యంతం దినం = అహోరాత్రం। తతః = నవమమాసా దూర్ధ్వం స్నానమాత్రం స్యాదితి సంబంధః॥ దేశాంతరమృతిశ్రవణే అవిశేషేణ త్రిమాసాదా వపి స్నాన మేవేత్యాహ- స్నానం దేశాంతరస్థ ఇతి॥

శ్లో॥ మాసత్రయే త్రిరాత్రం స్యాత్। షణ్మాసే పక్షిణీతథా అహస్తు
నవమాదర్వా । గూర్ధ్వం స్నానేన శుధ్యతీతివృద్ధవసిష్ఠవచనాత్॥

శ్లో॥ దేశాంతరమృతం శ్రుత్వా, క్లీబే చారణ్యకే యతౌ। మృతే స్నానేన
శుధ్యంతి । గర్భస్రావేణ గోత్రిణ ఇతిస్మృత్యంతరాచ్చ॥

దేశాంతరలక్షణం త్వాహ బృహస్పతిః-

శ్లో॥ మహానద్యంతరం యత్ర । గిరిర్వా వ్యవధాయకః।
వాచో యత్ర విభిద్యంతే । తద్దేశాంతర ముచ్యతే॥

శ్లో॥ దేశాంతరం వద న్త్యేకే । షష్టియోజన మాయతం।
చత్వారింశ ద్వద న్త్యేకే। త్రింశ దన్యే తథైవ చేతి॥

వాగ్భేదః। గిరిమహానదీవ్యవధానం, వింశతియోజనా ద్యానంతర్యం వా, దేశాంతరలక్షణం॥ ఏత స్యాపవాదమాహ అథ పితృవిషయ ఇతి - దేశకాలావిరోధా త్సర్వదేశే. సర్వకాలేచ. పిత్రో ర్మాతుశ్చ మరణే సుతానాం స్వంస్వం = స్వస్వజాతివిహితం। దశాహాదిక మేవ॥పితృ విషయ ఇత్యత్ర, పితాచ మాతాచ పితరౌ, తౌ విషయా యస్యేతి సమాసః॥

శ్లో॥ పితరౌ చేన్మృతౌ స్యాతాం । దూరస్థోపి హి పుత్రకః

శ్రుత్వా తద్దినమారభ్య దశాహం సూతకీ భవే దితి వచనాత్ ॥

అపరమాతు ర్విశేష మాహ మాతు స్సపత్న్యాం త్రిదిన మితి-
అపరమాతరి. పుత్రస్య. దేశకాలావిశేషేణ నవమమాసా దూర్ధ్వమపి త్రిరాత్రం. తదుక్తం-

శ్లో॥ పితృపత్న్యా మపేతాయాం మాతృవర్జ్యం ద్విజోత్తమః

సంవత్సరవ్యతీతేపి త్రిరాత్ర మశుచి ర్భవేదితి॥

అత్ర శావశబ్దగ్రహణేన అతిక్రాంతే జననాశౌచేఅశుద్ధి ర్నైవేతి సూచితం॥ తథా చోక్తం॥

శ్లో॥ నాశుద్ధిః ప్రసవాశౌచే వ్యతీతేతు దినేష్వపీతి దేవలేన॥

ఏతదతిక్రాంతాశౌచం సర్వవర్ణసాధారణమిత్యాహ- ఇదమతిక్రాంత్యశౌచం సమానమితి-

ఇదమతిక్రాంతిః = అతిక్రమః।తత్సంబంధ్యశౌచం = ఆశౌచం, తత్ సమానం. సర్వవర్ణసాధారణ మిత్యర్థః॥

శో॥ ప్రోషితే కాలశేష స్స్యా దశేషే త్ర్యహ మేవహి

సర్వేషాం వత్సరే ఽపూర్ణే ప్రేతే చత్వోదకం శుచి రితివచనాత్॥

శ్లో॥ తుల్యం వయసి సర్వేషా మతిక్రాంతే తథైవచేతి వ్యాఘ్రపాదవచనాచ్చ॥

తా. మరణవార్త తెలిసినపిమ్మటనే అశుద్ధికి కారణమగునని వృద్ధులచే నిర్ణయింపబడినది. కనుక నాశౌచదినములు వెళ్ళినపిమ్మట దశాహాద్యాశౌచము తెలిసినచో మరణించిన దేశమందే తెలిసినయెడల 2 మాసముల లోపల నెరిగిన 3 దినము లాశౌచము. 3 మాసముల పిమ్మట 6 మాసములు వెళ్ళువరకును పక్షిణి అనగా రోజున్నర. 6 మాస

ములపిమ్మట 9 మాసములు వెళ్ళువరకును 1 రోజు ఆశౌచము. 9 మాసములు వెళ్ళిన పిమ్మట స్నానముతో సరియగును. దేశాంతరమందు మృతిని వినినచో 3 మాసములలోపలనైనను స్నానముతో శుద్ధి యగును. 'స్నానం దేశాంతరస్థే' అను వాక్యమువలన.

దేశాంతరమందు మరణవార్త వినినను, నపుంసకుడు, వానప్రస్థుడు, యతి మరణించినను, గర్భస్రావమందును సపిండులకు స్నానముతో సరియగును స్మృత్యంతరము వలన.

దేశాంతర లక్షణమును బృహస్పతి వివరించుచున్నాడు. గొప్ప నదిగాని, గొప్ప పర్వతముగాని అడ్డుగా నున్నను, భాష భేదించినను దేశాంతరమని చెప్పబడును. కొందరు 60 ఆమడ దూరమున్న దేశాంతరమనిరి. కొందరు 40 ఆమడ దూరమున్న దేశాంతర మనిరి. మఱికొందరు 30 యోజనముల దూరమున్న దేశాంతర మని వచించిరి.

వాగ్భేదము, గొప్పపర్వతము, గొప్పనది వీని వ్యవధానము, 20 ఆమడలదూరము దేశాంతరలక్షణములు.

దీనికి అపవాదమును చెప్పుచున్నాడు— దేశ, కాలభేదములేక ఏదేశమందున్నను, ఏ కాలమందైనను తల్లిదండ్రులవిషయమై తమ తమజాతికి నిర్ణయించబడిన దశాహాద్యాశౌచము వినిన దినమునుండియే విధింపబడినది.

సవతితల్లినిగూర్చి విశేషమును చెప్పుచున్నాడు - సపత్నీమాతృ మరణవార్తను 10 దినములువెళ్ళినపిమ్మట నెప్పుడు వినినను అనగా సంవత్సరమువెళ్ళినపిమ్మట వినినను 3 రోజు లాశౌచమును పట్టవలెను. కావ శబ్దమును గ్రహించుటవలన. ప్రసవమందతిక్రాంతాశౌచము లేదని యర్థము. జననమందతిక్రాంతాశౌచము లేదని దేవలుడు నుడి

నాంతు కథంభవేత్ । త్రిరాత్రే శైవ శుద్ధి స్స్యా దిత్యాహ భగవాన్
యమః ఇతి వృద్ధయాజ్ఞవల్క్యస్మరణాత్॥ అత్ర వాజసనేయినః పితృ
గృహమరణేతు పిత్రో త్రిరాత్రం భవత్యేవ॥ శ్లో॥ బైజికాదపి
సంబంధా దనుబంధ్యా దఘం త్ర్యహ మితి వచనాత్ ప్రసవే శ్యా
శౌచాభావ ఏవ॥

ప్రేతే ష్వాచార్యమాతామహదుహితృసుత శ్రోత్రియార్త్వి
క్ప్రయాజ్యస్వస్త్రీయేషు త్రిరాత్రం॥ ఉపనయనపూర్వకం వేదాధ్యాపక
ఆచార్యః। ఏకశాఖాధ్యాపనక్షమః శ్రోత్రియః। ఋత్విగాధ్వర్య్వాదియజ్ఞ
కర్మణ్యాకృత్ । సఏవ యాజ్యః యజమానసహితః । శేషాః ప్రసిద్ధాః
ఏతేషు మృతేషు త్రిరాత్రం। సోదక స్తూభయ స్తేతి - సోదకః = సమా
నోదకః - సప్తపురుషానంతరం సప్తపురుషావసానః. స ఉభయత్ర =
జాతాశౌచే మృతాశౌచేచ, త్రిదివసమేవ, అశుచిః అశుద్ధిః స్యాత్॥

యథా బృహస్పతిః:

శ్లో॥ త్ర్యహం మాతామహాచార్య శ్రోత్రియే ష్వశుచి ర్భవేదితి॥

ప్రచేతాశ్చ-

శ్లో॥ మృతే చ ర్త్విజీయాజ్యేచ త్రిరాత్రేణ విశుధ్యతీతి॥

వృద్ధయాజ్ఞవల్క్యోపి-

శ్లో॥ సంస్థితే పక్షిణీం రాత్రిం దౌహిత్రే భగినీసుతే।
సంస్కృతే తు త్రిరాత్రం స్యా దేవం ధర్మో వ్యవస్థిత ఇతి॥

మను రపి-

శ్లో॥ జన్మ న్యేకోదకానాంతు త్రిరాత్రా చ్ఛుద్ధి రిష్యతే॥
సమస్పృశో విశుధ్యంతి త్ర్యహా త్తూదకదాయిన ఇతి॥

తా. ఈ విధముగా స్వకులమందు జన్మించినవారిమృతాశౌచ
ము చెప్పి, కులాంతరము నాశ్రయించినవారై మరణించినవారికిన్ని

ఆశౌచమును 7 మొదలు 9 అఖువరకు 3 వృత్తములతో చెప్పుచున్నారు,

వివాహమైన స్త్రీ తండ్రియింట ప్రసవించిన నొకదినము జాతాశౌచము గలదు. తండ్రియింట మరణించిన 3 దినములు మృతాశౌచము సంభవించును. తండ్రియింట నసుటచే భర్తయింట ప్రసవించినను. మరణించినను తండ్రిపక్షమువారందరకును ఆశౌచాభావము సూచింపబడినది. విష్ణువచనమున్ను పై విధముగానే కన్పించుచున్నది. వివాహమైనకన్యకు తల్లిదండ్రుల యొక్క మరణమందు త్రిరాత్రాశౌచము. వృద్ధయాజ్ఞవల్క్యులున్నూ పైవిధముగానే వచియించిరి. వాజసనేయ శాఖవారికి వివాహమైనకన్యక తండ్రియింట మరణించినచో 3 దినము లాశౌచము గలదు. తండ్రియింట ప్రసవించిన జాతాశౌచము లేదు.

ఉపనయనపూర్వకముగా వేదమును చెప్పినగురువు ఆచార్యుదనబడును. ఒక వేదమును పూర్తిగా బోధించగలసమర్థుడు శ్రోత్రియుడు. యజ్ఞకర్మయం దధ్వర్యాదికర్మలను చేయించువానికి ఋత్విక్కు అని పేరు. యాజ్యః = యజ్ఞమును చేసినవాడు. ఆచార్యుడు, మాతామహుడు, దౌహిత్రుడు, శ్రోత్రియుడు, ఋత్విక్కు, యజ్ఞమును చేసినవాడు, మేనల్లుడు వీరిమరణమందు త్రిరాత్రాశౌచము. 8 మొదలు 14 వ పురుషాంతరమువరకు గలవారు సోదకు లనబడుదురు. అట్టివారికి జాతాశౌచ మృతాశౌచములు 3 రోజులు.

పై విధముననే ప్రచేతసుడు, వృద్ధయాజ్ఞవల్క్యుడు, మనువు మొదలగువారును వచించిరి.

అవ:– అసపిండానాం మాతామహాదీనాం దేశకాలాదిభేదేన పక్షిణ్యాశౌచవిధి—

8\. పక్షిణ్యాశౌచ మృత్విగ్గృహిత్రసుతసహాధ్యాయిబంధుత్రయాంతేవాసిశ్వశ్రూసుమిత్రశ్వశురభగినికాభాగినేయ్యుపయాణే

మాతామహ్యాంచ పిత్రోః స్వసరిచ విరతే మాతులే మాతులాన్యాం
చాథో సజ్యోతిరేవ స్వవిషయనృపతౌ గ్రామనాథేచ నష్టే ॥

వ్యాః— అథాష్టమం వృత్తం పక్షిణ్యాశౌచేతి - ఋత్విగాదయో భాగినేయాంతాః ప్రసిద్ధాః తేషాం ప్రయాణే మృతా వితి యావత్. మాతామహ్యాంచ విరతాయాం । పిత్రోస్స్వసరి = మాతృస్వసరి, పితృస్వసరిచ విరతాయాం । మాతులాన్యా = మాతులపత్న్యాంచ విరతాయాం, మాతులేచ విరతే, పక్షిణ్యాశౌచం । ఆశౌచకారణం. అథోసజ్యోతి రితి-స్వవిషయనృపతౌ = స్వదేశాధిపతౌ, నష్టే = మృతౌ గ్రామనాథేచ నష్టే. సజ్యోతి రేవ కాలః శుద్ధిహేతుః । సమానం జ్యోతి రాదిత్యో నక్షత్రం వా యస్మిన్ స సజ్యోతిః దివా నష్టే యావత్సూర్య దర్శన మశుద్ధిః నక్షత్రదర్శనాత్ శుద్ధిః॥ రాత్రినష్టేతు రాత్ర్యవసాన పర్యంత మే వాశుద్ధిః సూర్యదర్శనాత్ శుద్ధి రిత్యర్థః॥ యత్ర = యేషాం, పూర్వవృత్తే త్రిరాత్ర ముక్తం, తేషాం పునః పక్షిణీకథనం దేశకాలాదిభేదతో వ్యవస్థాపనీయం॥

శ్లో॥ ఆశౌచం పక్షిణీ రాత్రి మృతా మాతామహీ యది । తథాచ పక్షిణీ మసపిండయోనిసంబంధే సహాధ్యాయిని చేత్యాది వచనాని మూలం । సజ్యోతి రేవే త్యత్ర । శ్లో॥ ప్రేతే రాజని సజ్యోతి ర్యస్య స్యాద్విషయే స్థిత ఇతి మనువచనం మూలం।శ్లో॥ గ్రామే శ్వశురే, కుల పతౌ శ్రోత్రియేవా తపస్విని । శిష్యే పంచత్వ మాపన్నే శుద్ధి ర్నక్షత్ర దర్శనాత్॥

తా. పక్షిణ్యాశౌచమును చెప్పుచున్నాడు — ఋత్విక్కు, దౌహిత్రుడు, సహాధ్యాయి, ఆత్మబంధువులు, పితృబంధువులు, మాతృబంధువులు, శిష్యుడు, అత్త, ప్రాణస్నేహితుడు, మామ, సోదరి, మేన

ల్లుడు, మాతామహి, పినతల్లి, పెదతల్లులు, మేనత్తలు, మేనమామలు, మేనమామభార్య, వీరి మరణమందు పక్షిణ్యాశౌచము గలదు.

నోటు:— మేనత్త భర్తకును, మేనమామ భార్యకును, పినతల్లి భర్తకును పక్షిణ్యాశౌచము. (ఆచారములో లేదు. స్నానముతో సరి.) తనదేశాధిపతి, తనగ్రామాధిపతి మరణించిన— పగలుపోయిన నక్షత్ర దర్శనమువరకు, రాత్రి మరణించిన సూర్యదర్శనమువరకును అశుచిత్వము గలదు (ఇది యును ఆచరణలో లేదు). పూర్వవృత్తమునందు త్రిరాత్రాశౌచము చెప్పనవారికి మరల నీవృత్తమునందు పక్షిణ్యాశౌచమును విధించుట దేశకాలాదిభేదములవలన నని తెలిసికొనవలెను.

అవ.— అసన్నిధానాదినా ఏకరాత్రాశౌచః—

9. శిష్యోపాధ్యాయబంధుత్రయగురుతనయాచార్యభార్యాసగోత్రా
నూచానశ్రోత్రియేషు స్వగృహపరమృతౌ మాతులే చైకరాత్రమే
రాత్రం సబ్రహ్మచారిణ్యథ తు కథమపి స్వల్పసంబంధయుక్తే
స్నానం వాసోయుతం స్యా దిద మపి సకలం సర్వవర్ణేషు తుల్యమ్॥

వ్యా:- అథ నవమవృత్తం శిష్యేతి—మంత్రబ్రాహ్మణాన్యతరాధ్యాపకః ఉపాధ్యాయః। అనూచానః = అంగవక్తా, సగోత్రః = చతుర్థపురుషానంతరం సప్తపురుషావసానః, అన్యత్ స్పష్టం। అన్యేషు = శిష్యాదిషు ప్రమీతేషు,ఏకరాత్రం = అహోరాత్రం, ఆశౌచ మితి శేషః॥ తథా శ్లో॥ స్వగృహపరమృతౌ మాతులే చైకరాత్రమ్॥ తథా సబ్రహ్మచారిణి చైకరాత్రం। ఏకాచార్యోపనీతః సబ్రహ్మచారీ। శ్లో॥ గుర్వంతేవాస్యనూచానశ్రోత్రియేషు మృతేషు చేతి యాజ్ఞవల్క్యస్మరణాత్॥

బంధుత్రయగ్రహణే నాత్మబంధవో, పితృబంధవో, మాతృబంధవశ్చేతి గృహ్యంతే జ్ఞానేశ్వరాచార్యై ర్వ్యాఖ్యాతత్వాత్॥

శ్లో॥ ఆత్మపితృష్వసుః పుత్రా ఆత్మమాతృష్వసుః సుతాః।
ఆత్మమాతులపుత్రాశ్చ విజ్ఞేయా ఆత్మబాంధవాః॥

శ్లో॥ పితుః పితృష్వసుః పుత్రాః పితు ర్మాతృష్వసు స్సుతాః।
పితు ర్మాతులపుత్రాశ్చ విజ్ఞేయా పితృబాంధవాః॥
శ్లో॥ మాతుః పితృష్వసుః పుత్రాః మాతు ర్మాతృష్వసు స్సుతాః।
మాతుర్మాతులపుత్రాశ్చ విజ్ఞేయా మాతృబాంధవాః॥
త్రిరాత్ర మాహు రాశౌచ మాచార్యే సంస్థితే సతీతి।
తస్యపుత్రేచ పత్న్యాం చ దివారాత్ర మితి స్థితి రితిమనుస్మరణాత్॥
శ్లో॥ అహ రేకోదకానాంతు గోత్రజానా మహ స్స్త్రృత మితి జాబాలివచనాత్॥ అసపిండేషు స్వవేశ్మని మృతేషు ఏకరాత్ర మితి స్మరణాత్। అత్ర యేషాం పునర్గ్రహణం తేషా మసన్నిధానాదినా వ్యవస్థా ద్రష్టవ్యా। శ్రోత్రియస్య సమానగ్రామిణ స్యేతి వ్యాఖ్యేయం॥ ఏకాహం సబ్రహ్మచారిణి సమానగ్రామిణే ష్విత్యాశ్వలా యనవచనాత్॥

అథతు = కథమపి స్వల్పసంబంధయుక్తే, స్నానం వాసోయుతం స్యా దిత్యత్ర, అథ శబ్దోధికారాంతరసూచనార్థః॥ కథమపి = కేనాపి ప్రకారేణ, స్వల్పేనాపి సంబంధేన సంబంధిని, భగిన్యాదౌ (ఆదిశబ్దేన జామాతృ శ్యాలకౌ) సంస్థితే. స్నానం వాసోయుతం సచేలం స్నానం. శుద్ధ్యై స్యాత్ నాన్య దిత్యర్థః॥
తదుక్తం యాజ్ఞవల్క్యమునినా।
శ్లో॥ భగిన్యాం సంస్కృతాయాంతు భ్రాతర్యపిచ సంస్కృతే।
మిత్రే జామాతరి ప్రేతే దౌహిత్రే భగినీసుతే।
శ్యాలకే తత్సుతే చైవ సద్య స్స్నానేన శుధ్యతీతి॥
ఇదముప్యుక్తం సకల మాశౌచం సర్వవర్ణేషు తుల్యం = సాధారణమితి॥

తా, మంత్ర, బ్రాహ్మణములలో నొకదానినైనను చెప్పినవా డుపాధ్యాయుడు. వేదాంగములను బోధించువాడు గురువు. 16 మొదలు 21 వ పురుషాంతరము ఆఖరువరకు గలవారు సగోత్రులు. మ్యడు. ఉపాధ్యాయుడు [illegible] మాతృ

బంధువులు. గురుపుత్రుడు. ఆచార్యుని భార్య. అనగోత్రుడు. అను చానుడు. శ్రోత్రియుడు వీరలమరణమునందు ఒకదిన మాశౌచము. మేనమామ తనయింటగాని పరగృహమందునగాని మరణించిన నేకరాత్రా శౌచము గలదు. ఒకే గురువునొద్ద నుపనయనమును పొందినవారు సబ్రహ్మచారులు. అట్టివారికిని ఒకదిన మాశౌచము.

బంధుత్రయమును చెప్పుచున్నాడు విజ్ఞానేశ్వరీమే —

1. తన మేనత్త కుమాళ్ళు. తనపినతల్లి. పెత్తల్లికుమాళ్లు. తన మేనమామకుమాళ్లు వీర లాత్మబంధువులు;

2. తండ్రి మేనత్త కుమాళ్ళు. తండ్రిపినతల్లి పెత్తల్లికుమాళ్ళు తండ్రి మేనమామకుమాళ్ళు వీరు పితృబంధువులు.

3. తల్లి మేనత్తకుమాళ్ళు, తల్లి పినతల్లి పెత్తల్లికుమాళ్ళు. తల్లి మేనమామకుమాళ్ళు వీరు మాతృబంధువులు.

నోటు:- పూర్వము త్రిరాత్రముచెప్పినవారికి మరల పక్షిణి ఏకరాత్రా దులు చెప్పుట అసన్నిధానాదులచేత నని గ్రహించవలెను. ఏమాత్రము స్వల్పసంబంధముగలవారైనను సచేలస్నానము నాచరించవలెను. పైనచెప్పిన ఆశౌచ మన్నివర్ణములవారికిని సమానము.

స్మృతిముక్తాఫలే— ఆత్మబంధుషు, పితృబంధుషు, మాతృబం ధుషుచ పక్షిణ్యాశౌచ ముక్తం చంద్రికాయాం.

తా. చంద్రికయందు ఆత్మబంధువులకు, పితృబధువులకు మాతృ బంధువులకు పక్షిణ్యాశౌచము విధించబడినది.

ఆశౌచమధ్యే ఆశౌచాంతరసన్నిపాతః

10. బద్ధాశౌచస్య మధ్యే త్వపర మపి సమం స్వల్పకం వా సజాతి ప్రేతే జాత్యాంతరం వా యది భవతి సదా పూర్వశేషేణ శుద్ధిః

ద్వాభ్యాం తద్రాత్రిశేషే త్రిభి రపరదినై ర్యామినీయామశేషే
నైవాశౌచేన పిత్ర్యం పితు రుపశమనే పక్షిణీ మాతృమృత్యౌ॥

వ్యా:- ఇదానీ మాశౌచమధ్యే ఆశౌచాంతరసన్నిపాతే తన్నిర్ణయం దశమవృత్తే నాహ - బద్ధాశౌచస్యేతి - బద్ధాశౌచస్య = ప్రవృత్తాశౌచస్య, మధ్యే, యదితు పునః, అపరం = అన్య దపి, సమం = దశాహాశౌచమధ్యే దశాహాశౌచం, స్వల్పకం వా = త్రిరాత్రాదిక మశౌచంవా, సజాతి = సమానజాతీయం, జాతాశౌచస్య మధ్యే జాతాశౌచం, మృతాశౌచస్య మధ్యే మృతాశౌచం చ భవతి. తదా పూర్వశేషేణ శుద్ధిః॥ సమం స్వల్పకం వే త్యనేన స్వల్పాశౌచస్య మధ్యే పతితస్య దీర్ఘాశౌచస్య న పూర్వేణ శుద్ధి రితి వేదితవ్యం తదుక్తం ముశసహా:- శ్లో॥ స్వల్పాశౌచస్య మధ్యేతు దీర్ఘాశౌచం భవే ద్యది। నపూర్వేణ విశుద్ధిస్స్యా త్తత్కాలే నైవ శుద్ధ్యతీతి॥

ప్రేతే జాత్యంతరేవా - తథా, ప్రేతే = ప్రేతాశౌచస్యమధ్యే, యది జాత్యంతరం = విజాతీయం - జననాశౌచం భవతి, తదా పూర్వేణ మృతాశౌచే నైవ శుద్ధిః॥ ఏతేన జాతాశౌచమధ్యే సంజాతస్య ప్రేతాశౌచస్య నపూర్వేణ శుద్ధి రిత్యపి జ్ఞాతం॥ శ్లో॥ శావేన శుధ్యతే సూతిః న సూతి శ్శావశోధనీతి స్మరణాత్॥ కౌర్మేచ - అఘానాం యౌగపద్యేతు జ్ఞేయా శుద్ధి ర్గరీయసా॥ మరణే త్వతి యోగేతు గరీయో మరణం భవేదితి॥

ద్వాభ్యాం తద్రాత్రిశేషే = రాత్రిమాత్రావశేషే, యద్యా = శౌచాంతరం పూర్వోక్తం భవే త్తదా ద్వాభ్యా మపరదినాభ్యాం శుద్ధిః॥ త్రిభి రపరదినై ర్యామినీయామశేషే। యామిన్యాయామః = ప్రహరః తన్మాత్రావశేషే = తురీయప్రహరశేషే, త్రిభి రపరదినైః = ఉత్తరదివసైః శుద్ధిః, పూర్వాశౌచా దధికం త్రిభి ర్దినై శ్శుద్ధిః॥ న పూర్వాశౌచశేషమాత్రే ణేతి భావః॥ సూ.- రాత్రిశేషే సతి ద్వాభ్యాం ప్రభాతే తిస్రః స్మృతేతి గౌతమవచనాత్॥

పిత్రో ర్విశేష మాహ - నైవాశౌచేన పిత్ర్య మితి - అన్యాశౌచమధ్యే యత్పతితం। పిత్ర్యం = మాతాపితృసంబంధ్యాశౌచం। తత్పూర్వ శేషేణైవ న శుధ్యేత్। పితు రుపరమే। మాతు ర్వోపరమే త ద్దశాహమేవాశుద్ధి రితి భావః॥ తయో ర్మాతృపితృ విరతినిమిత్తయో ర్వరస్పరసన్నిపాతేపి నపూర్వశేషేణశుద్ధిః॥ కింతు మాత్రాశౌచస్య మధ్య పతితస్య పిత్రాశౌచస్య న సంకోచః॥ మాతు ర్విశేష మాహ - పితు రుపశమనే పక్షిణీ మాతృమృత్యా వితి - పితు రుపశమనే = పిత్రాశౌచ మధ్యే, మాతృమృత్యా = మాతృమరణే జాతే సతి, పక్షిణీ అధికా అశుద్ధి హేతుః॥ న తు యావ త్తద్దశాహ మితి భావః॥ అథా చ స్మృతిః - శ్లో॥ మాత ర్యగ్రే ప్రమీతా యా మశుద్ధౌ మ్రియతే పితా। పితు శ్శేషేణ శుద్ధి ర్న మాతుః కుర్యాచ్చ పక్షిణీం॥

తా. ఇప్పు డాశౌచమధ్యమునందున మరియొక ఆశౌచము సంభవించినచో దాని నిర్ణయమును చెప్పుచున్నాడు — ప్రవర్తించుచున్న దశాహాశౌచమధ్యయందున మరియొక దశాహాశౌచము సంభవించనను. దశాహాశౌచమధ్యయందున త్రిరాత్రాశౌచము సంభవించినను. జాతాశౌచమధ్యయందున జాతాశౌచమును, మృతాశౌచమధ్యమున మృతాశౌచమును, ప్రాప్తించినచో పూర్వశేషముచేతనే శుద్ధి యగును.

స్వల్పాశౌచమధ్యమున సంప్రాప్తించిన దీర్ఘాశౌచమునకు పూర్వాశౌచముచేత శుద్ధిలేదు. పైవిధముననే ఉశనసుడుకూడ వచించెను. మృతాశౌచమధ్యమున జాతాశౌచము సంభవించినచో మృతాశౌచముతోనే శుద్ధియగును. జాతాశౌచమధ్యమున మృతాశౌచము వచ్చినచో జాతాశౌచ మంతటితో నివృత్తియై మృతాశౌచము ప్రారంభమగును. మృతాశౌచముచే జాతాశౌచము శుద్ధియగును. జాతాశౌచముచే మృతాశౌచము శుద్ధికాదు.

పూర్వాశౌచ మొకరోజు మిగిలియుండగా, మరియొక యాశౌచము సంభవించినచో, రెండవయాశౌచమును మరి రెండురోజులు పట్టవలెను.

పదియవనాటిరాత్రి యొకజాము మిగిలియుండగా రెండవ యాశౌచము ప్రాప్తించినచో నది 3 దినములతో శుద్ధియగును. "రాత్రి శేషే సతి ద్వాభ్యాం ప్రభాతే తిసృభి స్మృతా" యనెడి గౌతమ వచనమువలన.

ఇతరాశౌచమధ్యమున పడిన తల్లిదండ్రుల యాశౌచమునకు పూర్వాశౌచశేషముచే శుద్ధిలేదు, తండ్రియాశౌచమునుపట్టుచుండగా తల్లి మరణించినను, తల్లియాశౌచమును పట్టుచుండగా తండ్రి మరణించినను పూర్వాశౌచముచే శుద్ధి లేదు. తల్లియాశౌచముయొక్క మధ్యవచ్చిన తండ్రియాశౌచమునకు సంకోచము లేదు. తల్లివిషయమై విశేషమును చెప్పుచున్నాడు — పిత్రాశౌచమధ్యమున మాత మరణించినచో నొకపక్షిణిమాత్ర మధికముగా తల్లియాశౌచమును పట్టవలెను. మరల పదిదినములు పట్టనక్కరలేదు. తల్లియాశౌచమధ్యయందున తండ్రి మరణించినచో తండ్రియాశౌచమునకు సంకోచములేదు. తండ్రియాశౌచములో తల్లి మరణించినచో తండ్రి దశాహానంతరము, తల్లినిమిత్తమై పక్షిణి పట్టవలెను.

నోటు:- తండ్రిమరణించినది మొదలు పదిదినము లాశౌచము పట్టి, తండ్రికి షోడశమువరకు కర్మచేసి 12 వ రోజునుండి పక్షిణ్యాశౌచము పట్టి, తల్లికి కర్మచేయవలెను. తల్లికి కర్మచేయుచుండగా తండ్రి మరణించినచో వెంటనే తల్లికర్మ ఆపవలెను.

తండ్రి యాశౌచమధ్యమున తల్లి మరణించిన దహనసంచయనములను చేసి, కర్మఆపి, తండ్రికర్మషోడశమువరకు పూర్తిచేసి, పక్షిణి

పట్టి, తల్లికి కర్మ పూర్తిచేయవలెను. తండ్రికర్మ ముందు చేయవలెను. తల్లికి పక్షిణి పట్టవలెను. తల్లిదండ్రులిద్దరు నొకేరోజున మరణించిన వేరువిధము. ఇట్లని వైద్యనాథదీక్షితీయమున గలదు.

షోడశమువరకు అనగా ఆద్య, వసుగణ, రుద్రగణముల వరకు మాత్రమే చేయవలెను.

ఆహితాగ్న్యనాహితాగ్ని కర్మాశౌచవిధిః,
సూతికాయాః పుత్రపుత్రికాప్రసవనిమిత్తాశౌచవిధిశ్చ॥

11. సర్వం త్వాశౌచచ మంత ర్యది విదిత మిదం శేషమాత్రేణ శుద్ధిః
దాహాహ దాహితాగ్నౌ మరణదివసతో ఒన్యత్ర కుర్యా ద్దశాహమ్
పూర్ణే స్నాత్వా సచేలం విహితహితకృతావర్ష కా సూసాతికాతు
త్రింశద్రాత్రం నయోగ్యా పితృసురకరణే వింశతిం పుత్రసూస్తు॥

వ్యాః- సర్వం త్వితి-సర్వ మిద మాశౌచం యద్యాశౌచాంతర మధ్యే ఏవ విదితం = జ్ఞాతం, భవతి, తదా శేషమాత్రేణ = దశాహ మధ్యే యా న్యవశిష్టాని దినాని తావన్మాత్రేణ శుద్ధిః, నతు జ్ఞానదినా దారభ్యే త్యర్థః॥ ఏవం త్రిదినాద్యాశౌచేపి ద్రష్టవ్యం, ప్రోషితే కాల శేషః స్యాదితి యాజ్ఞవల్క్యస్మరణాత్॥ దాహాహ దాహితాగ్నౌ। ఇద మాశౌచ మాహితాగ్నౌ = సాగ్నికే మృతే। దాహాహాత్ = దాహదివ సతః। దశదినం కర్తవ్యం। నపునర్మరణదివసతః॥ అన్యత్ర = అనాహితా గ్నౌతు। మరణదివసతః కుర్యాత్, నతు దాహాదిదివసతః॥ శ్లో॥ అనగ్ని మతఉత్క్రాంతేః, సాగ్నేః సంస్కారకర్మణః। శుద్ధి స్సంచయనం దాహ న్మృతాహస్తు యథాతిథీ త్యంగిరోవచనాత్। ఆశౌచాంతే యత్కృత్వా శుచి ర్భవతి, తదాహ - పూర్ణే స్నాత్వేతి - పూర్ణే ఆశౌచే। సచేలం = సవస్త్రం యథా భవతి తథా స్నాత్వా। విహితహితకృతౌ = వేదోక్తాను

ష్ఠానే। దేవపితృకార్యే। అర్హకాః = యోగ్యాః। స్యుః। జ్ఞాతయ ఇతి శేషః॥ సూతికాయావిశేషమాహ - సూతికా। తు = పునః, త్రింశద్రాత్రం। విహిత హితకృతౌ = పితృసురకార్యే। యోగ్యా న = శుద్ధా న భవతీత్యర్థః॥ ఏతత్కన్యాప్రసవే। పుత్రస్య ప్రసవేతు విశేష మాహ వింశతిం పుత్ర సూ స్త్వితి - పుత్రజననీతు వింశద్రాత్ర ముభయకార్యేషు యోగ్యా న భవత్యేవే త్యన్వయః॥ వాక్యం:-సూతికాం పుత్రవతీం వింశద్రాత్రేణ కర్మాణి కారయేత్। మాసేన స్త్రీజననీ మితి పైఠీనసిస్మరణాత్॥

తా. ఒక ఆశౌచముపట్టుచుండగా మరియొక ఆశౌచము తెలిసినచో పూర్వాశౌచశేషముచేతనే శుద్ధియగును. ఇట్లే తిరాత్రాద్యాశౌచముల యందును తెలిసికొనవలెను.

ఆహితాగ్ని మరణమునందు దహనదినము మొదలు 10 దినములాశౌచము పట్టవలెను; మరణదినమునుండికాదు. అనాహితాగ్నికి మరణ దినమునుండి 10 దినములు పట్టవలెను, దహనదినమునుండి కాదు. పై విధమునచే అంగీరసుని వాక్యమును కన్పించుచున్నది. ఆహితాగ్నికి సంచయనము దహనదినమునుండియే లెక్క. ఆహితాగ్నికి ఆబ్దికాదులకు ప్రాణముపోయిన తిథియే లెక్క. అనాహితాగ్నికి సంచయనాదిపర్వమును మరణదినమునుండియే లెక్కింపవలెను.

ఆహితాగ్నికి - "ద్వితీయమాసికం దహనదినే కుర్యాత్" అను వాక్యమువలన ద్వితీయమాసికము దహనదినమందే పెట్టవలెను.

ఆశౌచాంతమందు చేయవలసిన విధిని చెప్పుచున్నారు - ఆశౌచము పూర్తియైనపిమ్మట సచేలస్నానము నాచరించినచో దేవపితృకార్యాను ష్ఠానములకు యోగ్యుడగుచున్నాడు. మగపిల్లవానినికనిన స్త్రీ స్నానాది 20 దినములకును, ఆడుపిల్లను ప్రసవించిన యువతి స్నానాది 30రోజు

లకును దేవపితృకార్యములందు యోగ్యురాలగును. ఇట్లని వచనమున్నూ కలదు. 11 వ దినమునుండి లెక్కించవలెను.

### మృతవాహకాశౌచవిధిభేదః

12. నిర్హృత్యాన్యం ప్రమీతం దివస మశుచికోఽథాపవర్ణం తదుక్తా
శౌచోధానాత మాద్యక్రతుశతఫలభా గాప్లవే నైవ శుధ్యేత్
నీత్వోపాధ్యాయమాతాపితృపరమగురూ న్బ్రహ్మచారీ న దోషీ
తేభ్యోన్యం నిర్హృతోస్య వ్రతమపి వితతం భ్రశ్యతే ఽవశ్య మేవ॥

వ్యా:- నిర్హృత్యేతి - నిర్హృత్యే త్యత్ర । అన్య మసపిండం, సవర్ణం నిర్హృత్య । దివస మశుచి ర్భవతి॥ వాక్యం - ఏత దహో రాత్ర మతద్గృహవాసినోఽతదన్నభోజినశ్చ జ్ఞేయం । తద్గృహవాసిన స్తదన్న మశ్నాదత స్త్రిరాత్రమ్॥ తదన్నాసినస్తు దశరాత్ర మితి జ్ఞేయం॥ భృతిగ్రహణేన సవర్ణశవనిర్హరణేతు తదన్నభోజనా ద్యభావేపి తజ్జాత్యాశౌచం భవతి॥ తథాచ కూర్మే- శ్లో॥ యది నిర్హరతి ప్రేతం ప్రలోభాక్రాంతమానసః । దశాహేన ద్విజ శ్శుధ్యేత్ ద్వాదశాహేన భూమిపః॥ అర్ధమాసేన వైశ్యస్తు శూద్రో మాసేన శుధ్యతీతి॥

తథాచ మనుః॥

శ్లో॥ అసపిండం ద్విజం ప్రేతం విప్రో నిర్హృత్య బంధువత్,
విశుధ్యతి త్రిరాత్రేణ మాతురాప్తాంశ్చ బాంధవాన్॥
యద్యన్న మత్తి తేషాంతు దశాహేనైవ శుధ్యతి।
అన దన్న న్న మహ్నైవ నచే త్తస్య గృహే వసేత్॥

అథాసవర్ణం స్నేహవశా న్నిర్హృత్య తదు క్తాశౌచః। య జ్జాతి యస్య నిర్హరణం । తస్మై ఉక్త మాశౌచం యస్య సః । తథాహి - బ్రాహ్మణశ్చే చ్ఛూద్రం నిర్హరే త్తదా మాస మశుచిః । తథా శూద్రశ్చే

బ్రాహ్మణం దశాహం। ఇత్యాది జ్ఞేయం॥ ఏవ ముపరత్నే ద్వర్ణః పూర్వం వర్ణ ముపస్పృశేత్ । పూర్వో వా అవరం తత్ర శవోక్త మాశౌచ మితి గౌతమవచనాత్ । అత్ర నిర్హరణోపస్పర్శశబ్దాభ్యాం ప్రేతవ హనం లక్ష్యతే । ఏతస్యాపవాద మాహ - అథానాథ మితి । అనాథం ప్రేతం నిర్హృత్య అశ్వమేధక్రతుశతఫలభాగ్భవేత్॥ అద్యక్రతుః = జ్యోతిష్టోమః । అప్లవేనైవ శుధ్యేత్ = స్నానమాత్రేణ శుద్ధో భవేత్। ఏవ కారేణ స్నానానంతర మాశౌచనివృత్తిః ప్రతిపాదితా॥ శ్లో॥ అనాథం బ్రాహ్మణప్రేతం యే వహంతి ద్విజాతయః। పదేపదే యజ్ఞఫల మానుపూర్వ్యా ల్లభంతి తే॥ న తేషా మశుభం కించిత్ పాపం వా శుభ కర్మణాం । జలావగాహనా త్తేషాం సద్య శ్శౌచం విధీయత ఇతి॥

అథ బ్రహ్మచారిణో విశేష మాహ - నీత్వేతి - ఉపాధ్యాయాదీన్, నీత్వా = నిర్హృత్య. బ్రహ్మచారీ న దోషి = నదోషభాగ్భవతి. బ్రహ్మచారీ; వ్రతా న్న భ్రశ్యత ఇతి చ॥ ఆచార్యపిత్రుపాధ్యాయా న్నిర్హృత్యాపి వ్రతీ వ్రతీ ఇతి యాజ్ఞవల్క్యవచనాత్ అన్యనిర్హరణే దోష మాహ-తేభ్యోన్య మితి-తేభ్యః = ఉపాధ్యాయాదిభ్యః. అన్యం నిర్హృతః అన్యనిర్హరణం కుర్వతః, అస్య = బ్రహ్మచారిణః. వితతం = విస్తృతం, చిరార్జిత మితి యావత్ । వ్రతమ ప్యవశ్యం భ్రశ్యతి । బ్రహ్మచర్యా చ్చ్యుతో భవతీ త్యర్థః॥ వాక్యం:- బ్రహ్మచారిణ శ్శవకర్మణో వ్రతా న్నివృత్తి రన్యత్ర మాతాపిత్రో రితి వసిష్ఠవచనాత్॥

తా. అసపిండుడైన సవర్ణప్రేతను మోసికొనిపోయినచో ఒక దిన మాశౌచముగలవాడగును. ఆశౌచాన్నమును తినక ఆశౌచగృహ మందు నివసించినచో 3 దినము లాశౌచము. ఆశౌచగృహమందు నివసించుచు ఆశౌచాన్నమును భుజించినచో 10 దినము లాశౌచము. ఆయా దబ్బుతీసికొని ప్రేతను మోసినచో ఆశౌచాన్నమును తినకున్నను ఆయా

జాతులకు చెందిన యాశౌచము నవలంబించవలెను. పై విధముననే కూర్మపురాణమందును, మనుస్మృతియందును చెప్పబడియున్నది. అసవర్ణ ప్రేతను స్నేహవశముచే వహించినచో ఆ యాజాతికి చెందిన యాశౌచము సంక్రమించును. బ్రాహ్మణుడు శూద్రుని వహించినచో 30 దినములాశౌచమును, శూద్రుడు బ్రాహ్మణుని మోసినచో 10 దినము లాశౌచమును, మిగతకులములకును నీ విధముననే తెలిసికొనవలెను. గౌతములవారును ఇట్లే వచించిరి. అనాథుడైన ప్రేతను వహించినచో నగ్నిష్టోమ మొనరించినఫలము లభించును. ఒకదినముకూడ నశుచిత్వము లేదు, స్నానముచేతనే శుద్ధుడగుచున్నాడు. అట్టివారి కేవిధమైన యశుభమును లేదు. బ్రహ్మచారి ఆచార్యుడు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయుడు వీరలను వహించినను బ్రహ్మచర్యవ్రతమునకు భంగములేదు. వీరికంటె నితరులను వహించినచో బ్రహ్మచర్యమునుండి భ్రష్టు డగును. ఇట్లని యాజ్ఞవల్క్యుడును, వసిష్ఠులవారును వచియించిరి.

### నీచోత్కృష్టజాతిమృతానుగమనాశౌచవిధిప్రకారః

13. తుల్యోత్కృష్టానుయానే వసనసహితకోఽంభస్యవాప్లుత్య వహ్నిం
స్పృష్ట్వాజ్యం ప్రాస్య శుధ్యే ద్దశ దిన మశుచి ర్హీనవర్ణానుయానే
పక్షి ణ్యేకాంతరానువ్రజన ఇహ భవేత్ ద్వ్యంతరత్వే త్రిరాత్రం
కృత్వా స్నాత్వా సునద్యాం మసు యమనశతం సర్పిరాశం చ కుర్యాత్॥

వ్యా:- ఏవం నిర్హరణ మాశౌచ ముక్త్వా అనుగమనాశౌచం త్రయోదశవృత్తే నాహతుల్యేతి - తుల్యోత్కృష్టానుయానే = బ్రాహ్మణస్య బ్రాహ్మణానుయానం ఏవం క్షత్రియాదే రపి స్వస్వవర్ణానుయానం తుల్యానుయానం। ఉత్కృష్టయానంతు క్షత్రియస్య బ్రాహ్మణానుగమనం। వైశ్యస్య క్షత్రియబ్రాహ్మణానుయానం। తథా శూద్రస్య ద్విజాతీయానుగమనం । తచ్చ తచ్చ తుల్యోత్కృష్టానుయానం । తస్మిన్ కృతే।

వసనసహితః = సవస్త్రః। అంభసి = నద్యాదౌ। అవాప్లుత్య = స్నాత్వా। వహ్నిం స్పృష్ట్వా। ఆజ్యం = ఘృతం। ప్రాశ్య। విశుధ్యేత్। ప్రసిద్ధ మేత ద్వాక్యార్థకథనం। తత్రచ శ్లో॥ అనుగమ్యేచ్ఛయా ప్రేతం జ్ఞాతి మజ్ఞాతి మేవవా। స్నాత్వా సచేలం స్పృష్ట్వాగ్నిం ఘృతం ప్రాశ్య విశు ధ్యతీతి మనువచనం॥ మూలం-హీనానుగమనాశౌచమాహ అథ దినమితి - బ్రాహ్మణాదేః క్షత్రియాద్యనుగమనే। అనుగంతా బ్రాహ్మణాది। దినం = అహోరాత్రం। అశుచి ర్భవతీతి శేషః। పక్షిణ్యే కాంతరేతి ఏకాంతరాను యానే=బ్రాహ్మణస్య వైశ్యానుయానే। క్షత్రియస్య శూద్రానుయానే పక్షిణీ అశుచితా నిమిత్తం భవేత్। ద్వ్యంతరత్వే త్రిరాత్రం బ్రాహ్మ ణస్య శూద్రానుయానే త్రిరాత్ర మనుగంతా బ్రాహ్మణోఽశుచి ర్భవేదితి సంబంధః॥ త్రిరాత్రానంతరకృత్య మాహ। త్రిరాతం కృత్వా। సునద్యాం= ఉత్తమజలే। స్నాత్వా అసుయమనం=ప్రాణాయామః। తచ్ఛతం కుర్యుః। ఏవం శుద్ధా భవంతీ త్యర్థః। తథాచ పరాశరః — శ్లో॥ ప్రేతభూతం పునః శ్శూద్రం బ్రాహ్మణో జ్ఞానదుర్బలః। అనుగచ్ఛే న్నీయమానం స త్రిరాత్రేణ శుధ్యతి॥ త్రిరాత్రే తు తత శ్చీర్ణే నదీం గత్వా సముద్రగాం। ప్రాణాయామశతం కృత్వా। ఘృతం ప్రాశ్య విశుధ్యతీతి॥

తా. అనుగమనాశౌచమును చెప్పుచున్నాడు - బ్రాహ్మణ క్షత్రియాది జాతులు స్వవర్ణశవము వెంట వెళ్ళినను లేక తమకంటె నెక్కుడు జాతిశవమును వెంబడించినను అనగా శూద్రుడు పైమూడుజాతుల వారిని, వైశ్యుడు పైరెండుజాతులవారిని, క్షత్రియుడు బ్రాహ్మణులను అనుగమించినచో స్నానముచేసి అగ్నిని స్పృశించి ఘృతప్రాశన మొనరించుచో పరిశుద్ధుడగును. బ్రాహ్మణుడు క్షత్రియుల ననుగమించినచో ఒకదిన మశుచియగును. బ్రాహ్మణుడు వైశ్యు ననుగమించినచో పక్షిణ్యాశౌచము కలుగును. శూద్రు ననుగమించినచో

త్రిరాత్రాశౌచము కలుగును త్రిరాత్రానంతరము స్నానముచేసి సూర్య ప్రాణాయామము లాచరించినచో శుద్ధు డగును- ఇట్లని పరాశరుడు వచించెను. క్షత్రియుడు వైశ్యు ననుగమించిన నొకదిన మాశౌచము. శూద్రు ననుగమించిన పక్షిణ్యాశౌచముగలవా డగును. వైశ్యుడు శూద్రు ననుగమించిన నొకదిన మాశౌచముగలవా డగును.

బ్రహ్మచారిణా మసపిండానాంచ దహన కర్తృ ప్రాయశ్చిత్తవిధిః.

-అవ. అధికారివిశేషేణాధికారవిశేషం చతుర్దశవృత్తేన దర్శయతి॥

14. తాతాంబాచార్యకేభ్యో౽నలజలతిలదో బ్రహ్మచారీ తదీయా శౌచే న్యేభ్యస్తు తద్దః పున రుపనయనం చాధికం కారయేత్తు అన్యే త్వజ్ఞాతికేభ్యో యది దదతి తదా తత్ర్ప యుక్తా శుభా స్యుః కుర్యాత్ కృచ్ఛ్రత్రయం చాత మదహనవిధౌ తం తమే వాప్నువన్తి॥

వ్యా తాతేతి - తాతః=పితా। అంబా=మాతా! ఆచార్యః= ఉపనీయ్య వేదాధ్యాపకః। ఏభ్యః। అనలజలతిలాన్ దదాతీ త్యనల జలతిలదః। ఏవంవిధో బ్రహ్మచారీ। తదీయాశౌచః = తదీయాశౌచ వాన్ భవతి। తదీయాశౌచశుధ్యా శుద్ధో భవతీ త్యర్థః॥ అన్యేభ్యస్తు। తద్దః = అనలజలదః। తదీయాశౌచస్య। ఆశౌచాంతే పున రుపనయన మధికం కారయేత్। తతః శుద్ధో భవతీ త్యభిసంధిః॥ ఏతచ్చ। ఆచార్య పిత్రొపాధ్యాయా న్నిర్హృత్యాపి। వ్రతీ=వ్రతి। శ్లో॥ సంకటాన్నంచ నాశ్నీయా న్నచ తైస్సహ సంవిశే దిత్యేతద్వ్యాఖ్యానే మితాక్షరా యాం స్పష్టీకృతం॥ అన్యేతు। అన్యే=బ్రహ్మచారి వ్యతిరిక్తాః। అజ్ఞాతి కేభ్యః॥ యద్యనలజలతిలాన్ దదతి। తదా తత్ర్పయుక్తా శుభాః=తదా శౌచభాజః స్యుః॥ తదీయాశౌచే నాశౌచవన్తః స్యు రితి తాత్పర్యం॥

అధికం కృచ్ఛత్రయంచాపి కుర్యా॥ తః శుద్ధా భవన్తి త్యర్థః॥ అధమ దహనవిధౌ॥ యదా అధమదాహకా॥ తదా తం తమేవ భావం ప్రాప్నువన్తి॥ తేన తేన అధమేన తుల్యా భవంతీ త్యర్థః॥ ఏతచ్చ నోత్తమ వ్తర్పయే న్నచ మి త్యనంతభట్టై ర్నిర్ణీతం॥

తా అధికారివిశేషముచే నధికారవిశేషమును చతుర్దశవృత్తముచే జెప్పుచున్నాడు - తండ్రి, తల్లి, ఆచార్యుడు వీరలకు దాహక్రియను, తిలతర్పణాదులను ఆచరించిన బ్రహ్మచారి తదీయాశౌచము నవలంబించుట యేగాక, ఆశౌచాంతమందు పునరుపనయనము నాచరించవలెను. బ్రహ్మచారి పైవిధముగా, ఆచార్యపితురుపాధ్యాయుల వహించినను దోషము లేదు. ఆశౌచాన్నమును భుజింపరాదు. వారితో నివసింపరాదనియు, మితాక్షరియందు వివరింపబడినది. గృహస్థులున్నూ జ్ఞాతులుకానివారలకు, అనలజలతిలాదుల నర్పించినచో, వారి వారి యాశౌచముగలవారగుచున్నారు. (పైవిషయ మాచరణలో లేదు. ఒకరోజు మాత్రమే ఆశౌచముగలదు. కర్మచేసినచో 10 రోజు లాశౌచము పట్టవలెను. కర్మచేసినవానిభార్యకుగూడ 10 దినము లాశౌచము గలదు) ఆశౌచానంతరము కృచ్ఛత్రయము లాచరించుటచే శుద్ధు లగుచున్నారు. తక్కువ కులమువారిని దహించినవారున్నూ వారివారియాశౌచముగలవా రగుచున్నారు. ఎక్కువకులమువారు తక్కువకులమువారిని దహించరాదని అనందభట్టుచే నిర్ణయించబడినది.

దేశాంతరే మృతస్య శరీరాలాభే దాహవిధిః, ఆశౌచవిధి శ్చ.

15. పాలాశీ మాహితాగ్నేః ప్రతికృతి మథవా ఒస్థిని దగ్ధ్వా దశాహం దాశౌచా జ్ఞాతయ స్స్యు స్తత ఇతరనృణాం త్రీ ణ్యహాన్యేవ కుర్యుః అన్యే విప్రా ద్యశౌచే సకృదదన మదం స్తావ దాశౌచకృ త్స్యా ద్వ్యావత్యాశౌచకాంతే వ్రతమపి చ చరే ద్రోదనే త్వేకరాత్రం॥

వ్యా:- అథ దేశాంతరే మృతస్య శరీరాలాభే దహన విధిః పంచదశవృత్తే నాహ పాలాశీమితి - ఆహితాగ్నేః=సాగ్నికశ్య। అస్థిః ప్రతికృతిం। తదలాభే శౌనకాదిగృహ్యోక్తవిధినా। పాలాశీం = పాలాశనిర్మితాం। ప్రతికృతిం కృత్వా। తాంచ దగ్ధ్వా। జ్ఞాతయో దశాహా ద్యాశౌచయ స్స్యుః॥ తత ఇతరన్నృణాం = అనాహితాగ్నీనాం। పాలాశ్యాది ప్రతికృతిం దగ్ధ్వా। జ్ఞాతయ స్త్ర్యహాని = త్రిదినం। ఆశౌచం కుర్యుః। అత్రోభయత్ర మూలం వసిష్ఠవచనం- ఆహితాగ్నిశ్చే త్ప్రవస న్మ్రియేత। త త్పున స్సంస్కారం కృత్వా శవవ దాశౌచం। అనాహితాగ్నిశ్చే త్త్రిరాత్ర మితి॥ శ్లో॥ సుపిష్టై ర్జలసమ్మిశ్రై ర్దగ్ధవ్య శ్చ కటాగ్నినా। అసౌ స్వర్గాయ లోకాయ స్వాహే త్యుక్త్వా స్వబాంధవైః॥ శ్లో॥ ఏవం పర్ణశవం దగ్ధ్వా త్రిరాత్ర మశుచి ర్భవేత్। ఇతి చ॥ అన్యః=విప్రాదిః। అన్య=అసకుల్యః। దశాహా ద్యాశౌచవతాం గృహే। అదనమన్నం=సిద్ధాన్నం। సకృత్ =ఏకవార మపి, అదవ్ = భుంజన్। తావ దాశౌచకృత్ = తేషాంయావత్కాలమాశౌచం।తావ దాశౌచకృత్ = అశుచిః స్యాత్। అంతే=ఆశౌచాంతే। తద్వ్రత మపిచ చరేత్। ఆశౌచాంతే యస్య యద్వ్రతం విహితం తదపిచ, చరేత్=కుర్యాత్॥ ఉభయత్ర దశాహాని కుల స్యాన్నంచ భుజ్యత ఇతి నిషిద్ధాచరణా దితి భావః॥ రోదనే త్వేకరాత్రం = ప్రేతసపిండైస్సహ రోదనేకృతే। ఏకరాత్ర మాశౌచకృత్ స్యాత్। తథాచ పరాశరః- శ్లో॥ మృతస్య బాంధవై స్సార్ధం కృత్వాతు పరిదేవనం। వర్జయే త్తదహోరాత్రం దానం శ్రాద్ధాది కర్మచేతి॥

తా. దేశాంతరమందు మరణించినవానికిని, శరీరముదొరకని వానికిని దహనవిధిని ౧౫ వ వృత్తముచే జెప్పుచున్నాడు - ఆహితాగ్ని మరణించినపుడు వానిశరీరము లభించనిచో వాని యెముకలతో శవా

కారమును నిర్మించవలెను. అస్థులుకూడ లభించనిచో శౌనకాదులచే గృహ్యసూత్రమునందు విధించబడిన విధముగా పలాశపర్ణములచే ప్రతికృతిని జేసి దానిని దహించవలెను. అదిమొదలు జ్ఞాతులు దశరాత్రాశౌచమును పట్టవలెను

అనాహితాగ్నులకు అస్థివిధానముచేతగాని, పలాశవిధానముచేతగాని దహనక్రియ జరిపినచో, జ్ఞాతులు త్రిరాత్రాశౌచముగలవారగుదురు. కటాగ్ని (దర్భాసనముతో కాల్చిన యగ్ని) చేత దహనము చేసినను 3 దినములే యాశౌచము. విప్రాదులు, దశాహాద్యాశౌచముగల యితరకులములవారి యన్నమును ఒక్కసారియైనను భుజించినచో వారివారి యాశౌచముగలవారగుచున్నారు. అంతమందెవరెవరి కేవ్రతము విధించబడినదో ఆ యావ్రతముల నాచరించవలెను. ప్రేతయొక్క సపిండులతోకలసి యేడ్చినచో నొకదిన మాశౌచముకలవారగుచున్నారు. ఇట్లని పరాశరస్మృతియందు విధించబడియున్నది.

జననమరణయో స్స్పృశ్యాస్పృశ్యవిధిః

16. జన్మ న్యస్పృశ్యతానో భవతి కులభువాం మాతృవర్జం పితుస్తు
స్నానా దూర్ధ్వం సచైలా దశ నిధనకృతాశౌచకల్పే త్రిభాగే
పూర్వాంశస్యోప రిష్ఠం మహసి చ యది సంచాయనం వృత్తమాసీ
న్నోచే త్తస్యోపరిష్టా దశతు గృహజయో ర్దాపయో రాప్లవోర్ధ్వం॥

వ్యా:- అత్రాశౌచశబ్దే నాశుచిత్వవాచినా, అస్పృశ్యత్వస్య ప్రతీతా యాధ్యా శాతాయాం జన్మాశౌచే తదపవాదం షోడశవృత్తే ప్రతీతా రాధ్యా తాయాం జన్మాశౌచే తదపవాదం షోడశవృత్తే ప్రతీతా యాధ్యా జాతాయాం జన్మాశౌచే తదపవాదం వాహ జన్మనీతి - జన్మనిమిత్తా, అస్పృశ్యతా। కులభువాం=సపిండానాం వాహ జన్మనీతి - జన్మనిమిత్తా, అస్పృశ్యతా। కులభువాం=సపిండానాం సోదకానాంచ న భవతి। కింతు, మాతృవర్జం॥ మాతుః=సూతికాయాస్తు। అస్పృశ్యతా। భవత్యేవే త్యర్థః॥ పితు ర్విశేషమాహ। స్నానా దూర్ధ్వం సచే లాదితి - సచేలస్నానా దూర్ధ్వం పితు రస్పృశ్యతా నోభవతీతి పూర్వేణ

సంబంధః॥ తథాచ సంవర్తః॥ జాతే పుత్రే పితుః స్నానం సచేలంతు విధీయతే। మాతా శుద్ధ్యే ద్దశాహేన స్నానాత్తు స్పర్శనం పితు రితి॥ అంగిరాశ్చ- సూతకే సూతికావర్జం సంస్పర్శో న నిషిధ్యత ఇతి॥ మృతాశాచే స్యస్పృశ్యత్వసంకోచన మాహ అథేతి-నిధనకృతాశౌచకే = మరణనిమిత్తాశౌచే। అల్పే = త్రిరాత్రాదికే। త్రిభాగే = త్రిధా విభక్తే। పూర్వాంశస్యోపరి = ప్రథమాంశా దుపరితనం యావద్భాగద్వయం। తత్రాస్పృశ్యతా నో భవతీతి సంబంధః॥ ఇత్థం॥ మహతిచ = దశాహాదికే। ఇత్థం = ఏవమేవ। యది సంచాయనం = అస్థిసంచయనం। ప్రథమదిన ఏవ ప్రవృత్త మాసీ త్తదైవాయం విభాగలక్షణప్రకారః। నోచేత్ = యదితు నకృతం స్యా త్తర్హి। తస్యోపరిష్టాత్ = అస్థిసంచయనానంతరం। దినాని త్రిధా విభజ్య, ప్రథమభాగం త్యక్త్వా। ఉత్తరభాగద్వయే। అస్పృశ్యతా నో భవతి। పూర్వభాగేతు భవత్యేవేతి తాత్పర్యం॥ శ్లో॥ స్యాశౌచకాలా ద్విజ్ఞేయం స్పర్శనంతు త్రిభాగతః॥ శూద్రవిట్‌క్షత్రవిప్రాణాం యథాశాస్త్రం ప్రణోదితం ఇతిస్మరణాత్॥ తథా- శ్లో॥ దశాహాదిత్రిభాగేన కృతే సంచయనే క్రమాత్। అంగస్పర్శనమిచ్ఛంతి వర్ణానాం తత్త్వదర్శినః। త్రి చతుః పంచ దశభిః స్పృశ్యా వర్ణాః క్రమేణ త్వితి దేవలస్మరణాత్॥ అథతు అథే త్యధికారాంతరే గృహజయోః=స్వగృహోత్పన్నయోః।దాసయోః ఆప్లవోర్ధ్వం= స్నానానంతరం అస్పృశ్యతా నోభవతీతి సంబంధః.

తా. అశుచిత్వమును చెప్పెడి ఆశౌచశబ్దముచేత నస్పృశ్యత్వము ప్రతీతి యగుచుండగా జన్మాశౌచమందు తదపవాదమును షోడశవృత్తముచేత చెప్పుచున్నాడు—జన్మయందు సపిండులకును, సోదరులకును అస్పృశ్యత్వము లేదు. తల్లికి అస్పృశ్యత్వము గలదు. తండ్రికి సచేలస్నానానంతర మస్పృశ్యత్వము లేదు. కుమారుడు కలిగినవెంటనే

స్నానము నాచరించినచో, తండ్రి శుద్ధుడగుననియు, తల్లి పదిరాత్రము లతో శుద్ధురాలగుననియు సంవర్తుని వచనము. సూతకమునందు సూతికకు దక్క నితరులకు స్పర్శదోషములేదని అంగిరసునివాక్యము. మృతాశౌచమునందును అస్పృశ్యత్వసంకోచమును చెప్పుచున్నారు. మృతాశౌచమునందును త్రిరాత్రాద్యల్పాశౌచమును మూడుభాగములు చేసినచో మొదటిభాగమున నస్పృశ్యత్వము గలదు. మిగత రెండుభాగములలో నస్పృశ్యత్వము లేదు. దశాహాద్యాశౌచములయందున్నూ ఇట్లే విచారించవలెను. సంచయనము ప్రథమదినముననే జరిగినచో పైవిధముగా మూడుభాగములుగా విభజించవలెను. అట్లు కానిచో, అస్థిసంచయనానంతరదినములను మూడుభాగములుగా విభజించి మొదటిభాగమును వదలినచో మిగత రెండుభాగములలో నస్పృశ్యత్వము లేదు. 3, 4, 5, 10 దినముల యనంతరము బ్రాహ్మణాదివర్ణములవారు క్రమముగా స్పర్శయోగ్యులగుచున్నారని దేవలవచనము.

తనగృహమందు జన్మించిన దాసులమరణమందు స్నానానంతరము శుద్ధికలుగును.

నోటు:- ఈశ్లోకములో పైనుదహరించబడిన విషయములన్నియు విస్పష్టముగా దాచరణలో లేవు —

దాసదాసీనాం యత్యాదీనా మాశౌచనిర్ణయః.

17. అన్నేనోపాత్తయోస్తు త్రిరజని చరణా ద్దత్తదాసానికానాం స్వామ్యాశౌచాహసంఖ్యా సమదినగమనా దూర్ధ్వ మన్యత్తు సూక్తం జాతే ఉపత్యేషు తస్మి న్నహాని నిశిచ త న్మంగలార్థేషు యోగ్యా సద్యాశౌచం సదానో భవతియతివని బ్రహ్మచర్యస్థితానాం॥

వ్యా:-దాసభేదే నాస్పృశ్యత్వకాలా దూర్ధ్వ మస్పృశ్యతా నోభవతీతి పూర్వశ్లోకగతే ఽన్వయః॥ తు శబ్దేన పూర్వస్మా ద్విశేష ఉక్తః॥

దత్తదాసాదికానాం స్వామ్యాశౌచాహ స్సంఖ్యా సమదివసగమనా దూర్ధ్వం అస్పృశ్యతా నో భవతీ త్యే వాన్వయః॥ ఆదిశబ్దేన ద్రవ్యాదిక్రీతానాం సంగ్రహః॥ స్వామినో యా న్యాశౌచదినాని తేషాం సంఖ్యయా సమదినాన్యతిక్రమణా దూర్ధ్వ మిత్యర్థః॥ అన్యత్తు సూక్తం॥ దాసస్య స్వపాధ్య కర్మ ణ్యేవ యోగ్యతా। నతు కర్మాధికారే॥ తథా సూతికాయా దాస్యాః స్వప్రసవనిమిత్త మస్పృశ్యత్వం మాసమి త్యేతత్. సూక్తం = స్పష్టం॥ దాసాద్యాశౌచే-శ్లో॥ సద్య శ్శుధ్యే ద్గర్భదాసో భక్తదాస స్త్ర్యహా చ్ఛుచి రితి స్మృతిః॥ తథా - శ్లో॥ దాసీనాసశ్చ సర్వే వై యస్య వర్ణస్య యో భవేత్। తద్వర్ణస్య భవే చ్ఛౌచం దాస్యా మాసంతు సూతకం॥ ఇత్యంగిరోవచనం మూలం॥

ఇదానీం జాతాశౌచే జననిమిత్తం యత్కార్యం తత్ర శుద్ధి ముత్తరార్ధేనాహ - జాతేఽపత్యే = అపత్యే జాతే। తన్మంగలార్థేషు = త స్యాపత్యస్య మంగళార్థకర్మసు। తస్మి న్నహని = తస్యామేవ నిశి చ యోగ్యా ఇత్యన్వయః॥ అయ మర్థః। అపత్యమంగళార్థాని కర్మాణి యస్మిన్ దినే, యస్యాంచ నిశి, విహితాని, తేషు ప్రథమదినాదిసాధ్యేషు కర్మసు। సర్వే సూతకినః తస్మిన్ కాలే, యోగ్యాః = అధికారిణః॥ భవంతీతి॥ తథాచ వ్యాసవాక్యం - శ్లో॥ సూతికావాసనిలయాః జన్మదా నామ దేవతాః। తాసాం యాగనిమిత్తార్థం శుద్ధి ర్జన్మని కీర్తితా॥ శ్లో॥ ప్రథమే దివసే షష్ఠే దశమేచైవ సర్వదా। త్రిష్వేతేషు న కుర్వీత సూతకం పుత్రజన్మనీతి॥ ఉక్తాశౌచస్య సర్వం పురుషవిశేషే అపవాద మాహ = పర్యాశౌచ మితి - ఏతత్సర్వ మాశౌచం। సదా = సర్వకాలం, యతిః, సన్యాసీ। వానప్రస్థో = వనీ। బ్రహ్మచర్యస్థితః = ఉభయవిధో బ్రహ్మచారీ। ఏతేషాం నోభవతి॥ ఏతే యత్యాదయో న కథంచిద ప్యాశౌచ భాజో భవంతీ త్యర్థః॥

తా. దాసభేదముచేత నస్పృశ్యాశ్యకాలానంతర మస్పృశ్యత లేదని పూర్వశ్లోకమునందు వివరింపబడినది. తు - శబ్దముచేత పూర్వముకంటె విశేషము చెప్పబడినది. దత్త దాసాదులకు స్వామ్యాశౌచదినముల సంఖ్యకు, సమవిరగమునా మూర్ధ్వమం దస్పృశ్యత్వము లేదు. ఆదిశబ్దముచేత క్రయవస్తువులకు దోషములేదని భావము. స్వామి కెన్ని ఆశౌచదినములు గలవో వానితో సమానదినములయొక్క అతిక్రమణానంతర మని యర్థము. దాసునికి స్వామ్యకర్మయందే యోగ్యత. కర్మాధికారమందు యోగ్యత లేదు. సూతికయైన దాసికి, స్వప్రసవనిమిత్తమైన యస్పృశ్యత యొకనెలమాత్రమే, గర్భదాసుడు వెంటనే శుచియగును. భక్తదాసుడు మూడుదినములతో శుద్ధుడగును. దాసి, దాసుడు మొదలగువారు - ఏవర్ణమున కేయాశౌచము విధింపబడినదో, ఆయావర్ణములయొక్క శుద్ధి గలుగును: దాసికి నెలకొక్కు సూతక మనునంగిరోవచనమువలన, జాతాశౌచమునందలి శుద్ధి యుత్తరార్థముచేజెప్పుచున్నాడు- సంతతికలిగినపిమ్మట నాయా శిశువుయొక్క మంగళార్థమైన కర్మ చేయుదినములందు విధింపబడినవో ఆయాదినము లాయా కర్మలనిమిత్తమై శుద్ధిగలవి యగును. 1, 6, 10 దినములయందు పై కర్మలనిమిత్తమై ఆశౌచము లేదు. సన్యాసి, వానప్రస్థుడు. బ్రహ్మచారి వీరల కేవిధమైన యాశౌచము లేదు. ఈ విషయములున్నూ ప్రస్తుత మాచరణలో లేవు.

వ్రతాదియుక్తానాం, యాగాదికర్మకర్తౄణాం,
కర్మనియుక్తానాంచ ఆశౌచాభావః

18. తత్కార్యేషు సవతి, త్రిప, నృప, నృపవద్దీక్షితత్విక్సదేశ
భ్రంశాపత్స్వ ప్యనేక శ్రుతిపఠనభిషక్కారుశిల్పకానాం
సంప్రాప్తగబ్దేషు దానోపనయన యజన శ్రాద్ధయుద్ధప్రతిష్ఠా
చూడాతీర్థయాత్రా జపపరిణయనా ద్యుత్సవే ష్వేత దర్థే॥

వ్యా:- అథ యేషు యేషు కార్యేషు యేషాం యేషాం సూతకినాం తత్తత్కాలికే శుద్ధిస్తేషాం తామస్తావవవృత్తే నాహ తత్తత్కార్యేష్వితి- యేషాం యానియాని కార్యాణ్యాజీవికార్థం విహితాని తేషాం తేషు తేషు కర్తవ్యేష్వనన్యసాధ్యేషు సర్వాశౌచం సదా నాభవతీతి పూర్వశ్లోకే నాన్వయః॥ సత్రి సత్రిణః=అన్నసత్రప్రవృత్తాః॥ ప్రతినః ప్రాయశ్చిత్తాదిఅనుష్ఠాతారః నృపః=రాజ్యేఽభిషిక్తః। నృపదాసాః= రాజసేవకః। దీక్షితః=యాగకర్తా। ఋత్విజః= అధ్వర్యవాదికర్మకర్మారః। అనేకశ్రుతిపఠనః=బహువేదశాఖాధ్యయనశీలః॥ ఆతురః= రోగి। అన్యేతు ప్రసిద్ధాః॥ ఏతేషు సంప్రారబ్ధేషు నిష్పాద్యమానేషు॥ ఏతద్వర్థే=ఏతన్నిమిత్తే కార్యే। ఏతైః=సత్ర్యాదిభిః॥ సంపాద్యమానకార్యే ఇతి యావత్॥ ఏతేషాం సర్వాశౌచం నోభవతీత్యనేనైవ సంబంధః॥

తథాచ యాజ్ఞవల్క్యవచనం —

శ్లో॥ ఋత్విజాం దీక్షితానాంచ యజ్ఞీయం కర్మకుర్వతాం।
సత్రివ్రతిబ్రహ్మచారిదాతృబ్రహ్మవిదాం తథా।
దానే వివాహే యజ్ఞేచ సంగ్రామే దేశవిప్లవే।
ఆపద్యపిచ కష్టాయాం సద్యశ్శౌచం విధీయత ఇతి॥

కష్టాపదః=దుర్భిక్షాద్యాః॥ తథాచ ప్రచేతో వచనమపి॥

శ్లో॥ కారవశ్శిల్పినో వైద్యాః దాసీదాసాస్తథైవచ॥
రాజనో రాజభృత్యాశ్చ సద్యశ్శౌచాః ప్రకీర్తితాః

తా. ఏయే కార్యములను ఏయే సూతకులకు తాత్కాలికశుద్ధి గలదో దానిని 18 వ వృత్తమువేత జెప్పుచున్నాడు. ఎవరెవరికేయే కార్యములు జీవనకు నిమిత్తమై యేర్పరుపబడినవో, అట్టివారికాయా చేయదగిన యనన్యసాధ్యములైన కార్యములయందు సర్వాశౌచ మెల్లప్పుడును లేదని పూర్వశ్లోకముయొక్క అన్వయము.

అన్నసత్రములు పెట్టువారు, ప్రారంభించబడిన ప్రాయశ్చిత్తాది వ్రతములు గలవారు, పట్టాభిషిక్తుడైన రాజు, రాజసేవకుడు, యాగము చేయువాడు, ఋత్విక్కులు అనేక వేదములు చదివినవారు, రోగగ్రస్తుడును, దేశభ్రంశాద్యాపదలు సంభవించినపుడును, వైద్యుడు, కారుడు, శిల్పి, ఆతురుడు మొదలగువారికిన్ని సద్యశ్శౌచము విధించబడినది.

దానము, ఉపనయనము, యజ్ఞము, శ్రాద్ధము, యుద్ధము, ప్రతిష్ఠ, చూడాకర్మ, తీర్థయాత్ర, జపము, వివాహము మొదలగు, ఉత్సవములందును ప్రవర్తించువారికి సద్యశ్శౌచము విధించబడినది. కారువులు, శిల్పులు, వైద్యులు, దాసి, దాసుడు, రాజు, రాజభృత్యుడు, వీరలు సద్యశ్శౌచముగలవార లని ప్రచేతోవచనము.

నోటు:—వివాహమునందు వధూవరులకును, ఉపనయనమునందు వటువునకును దీక్షాంతమువరకు ఆశౌచము లేదు, మిగతవారికి గలదు.

శ్లో॥ న కర్తవ్యం న కర్తవ్య మఘసంకోచనం కలౌ,
క్రమాశౌచం గుణాశౌచం నిరస్యం దూరతః కలౌ॥

తా, కలియుగమునం దఘసంకోచనము చేయరాదనియు క్రమాశౌచమును, గుణాశౌచమును కలియుగమున దూరముగా వదలవలెననియు ఆశౌచశతకమున గలదు.

పతితాదీనా మాశౌచాభావః

18. నాశౌచా జ్ఞాతయ స్స్యుః పతితపతిసుతబ్రహ్మవిద్భూతినీషు
దోషా త్పాషండిచోరాశ్రమరహితసురాపాయుహీనోపగాసు
సందర్భా త్సర్వవిప్ర, క్రితిప. పశు దివాకీర్తికాద్యై ర్హతేషు
స్వేచ్ఛాపూర్వంచ శస్త్రజ్వలనజలవిషాద్యైనాశకాద్యై ర్మృతేషు॥

తా.– ఇదానీం మృత్యువిశేషాద ప్యాశౌచాపవాద మేకోన వింశేన వృత్తే నాహ నాశౌచా ఇతి- పతితాస్తు = స్మృత్యంతరోక్తాస్తు। పతితేత్యాదము న. స్త్రీషు మృతాసు. ప్రసూతాసువా, జ్ఞాతయః = సపిండాః। నాశౌచాః = అశౌచభాజో న స్యుః। తథా। దోషాః = దోషేన హేతునా. యే. పాషండం = వేదానుక్తధర్మభాసం। ఆశ్రయంతే। తే తే పాషండినః। అవిహితలింగధారిణా ఇతి యావత్, చోరాః = అననుజ్ఞాతద్రవ్యహరాః। ఆశ్రమరహితాః = సత్యధికారే వ్యక్తాశ్రమవిశేషపరిగ్రహాః। సురాపేయాః = నిషిద్ధసురాపానసహితాః। హీనోపగాః = అధమేన సహ సంభోగరతాః ఆసుమృతాసుచ। జ్ఞాతయః నాశౌచాః స్యు రితి సంబంధః॥ అత్ర లింగ మవివక్షితం। తథా। సదర్పాః। దర్పః = గర్వః। ఏతస్మాత్ = గర్వేణ। బుద్ధిపూర్వం సర్పాదీన్। దవాక్రిః = చండాలః। తదంతానపకర్తుం। అభిముఖ్యేన యే ప్రవృత్తా స్సంతః తైర్హతాః। తేషు మృతేషు । నాశౌచాజ్ఞాతయ స్స్యుః॥ ఏభిర్దైవా ద్ధతేషు నేవ మిత్యర్థః। తథా స్వేచ్ఛాపూర్వం శస్త్రం = లోహం। జ్వలనః = అగ్నిః జలం = వారి। విషం = వత్సనాగాది। అనాశకం = అవిహితోపవాసః। అవిశబ్దా దవిహిత భృగుపాతాది। ఏభిః ప్రకారై ర్మృతే ష్వపి: జ్ఞాతయో నాశౌచా స్స్యరి త్యన్వయః॥ శ్లో॥ పాషండ్యనాశ్రితా స్తేనాః భర్తృఘ్న్యః కామచారిణః సురాప ఆత్మత్యాగిన్యో నాశౌచోదకభాజనా ఇతియోగీశ్వర స్మరణాత్॥

తా. మృత్యువిశేషమువలననున్నా ఆశౌచాపవాదమును 19 వ వృత్తముచేత జెప్పుచున్నాడు—స్మృత్యంతరమందు చెప్పబడిన పతితురాండ్రయిన స్త్రీలు చనిపోయినను. ప్రసవించినను సపిండుల కాశౌచము లేదు. ఎవరు వేదవిరుద్ధధర్మముల నాచరించువారై

యవిహితమైన (వేదమందు చెప్పబడని) చిహ్నములను ధరింతురో వారు పాషండులు. అట్టి పాషండులున్నూ, దొంగలున్నూ, అధికార ముండియు నే యాశ్రమమును పరిగ్రహించకుండు వారును, నిషిద్ధసురా పానము నాచరించువారును, అధమునితో సంభోగముచేయునట్టియు స్త్రీలు మరణించినచో జ్ఞాతుల కాశౌచము లేదు.

గర్వముతోకూడిన సర్పములు, పశువులు, చండాలురు మొద లగువారిచే ప్రత్యక్షముగా దైవయోగమున జంపబడినవారికిని ఆశౌ చము లేదు.

స్వేచ్ఛగా శస్త్రము, అగ్ని, జలము, విషము, అభోజనము మున్నగువానిచే మృతినొందినవారికిని జ్ఞాతులాశౌచము పట్టనక్కర లేదు. యోగీశ్వరులవారును పైవిధముననే వచించిరి.

నోటు:- ఈ శ్లోకమునందు చెప్పబడిన ధర్మములు కలియుగ మున నాచరణలో లేవు.

ఆశౌచగృహే స్వీకారద్రవ్యనిర్ణయః

20. నాశౌచం శాకకాష్ఠాజినలవణతృణక్షీరసీరామిషేషు
పుష్పే మూలే ఫలే చౌషధి దధి మధుషు స్యాత్తి తే ష్వామభోజ్యే
దద్యాద్దద్యాదిమాని స్వయమనుమననా త్స్వామినో యాతి జాతా
శౌచేవా కృత్రిమేవా పణిత మపణితం చాపి సర్వం శుచిః స్యాత్॥

వ్యా:- ఇదానీ మాశౌచినాం యదుపాదేయం ద్రవ్యం వింశతిత మవృత్తే నాహ నాశౌచమితి- యాభిః। గతిః = మరణ మితి యావత్। యాతి జాతాశౌచంతస్మిన్। జాతం = జన్మ। తన్నిమిత్త మాశౌచం। ఆశౌచే। ఏషు = శాకాది ష్వామ కృత్రిమేవా = నిమిత్తాంతరకృతేవా। ఆశౌచం = ఆశౌచసంబంధి దోషః న భోజ్యాంతేషు ద్రవ్యేషు।

ఏతాని సర్వాశౌచే ష్వపి శుద్ధానీ త్యభిప్రాయః। అత్ర షష్ఠ్య
స్యాత్॥ ఏతాని సర్వాశౌచే ష్వపి శుద్ధానీ త్యభిప్రాయః। అత్ర షష్ఠ్య
సప్తమ్యంతపదాని నాశౌచ మిత్యనేన ప్రత్యేకం యోజ్యాని॥ దద్యా
దద్యా దిమాని స్వయ మితి - అనుమననాత్ = తత్స్వామ్యనుజ్ఞయా,
ఇమాని = శాకాదీని। స్వయ మాశౌచరహితః పుమాన్ అన్యేభ్యో
దద్యాత్। స్వయం చాద్యాచ్చ। ఏవంకృతే దోషో న భవతీత్యభిసంధి॥
తథా। పణిత మపణితంచ సర్వం పణ్యే శుచిః స్యా దితిస్పష్టం। తథాహ
మరీచిః। శ్లో॥ లవణే మధుమాంసేచ పుష్పమూలఫలేషుచ। శాక కాష్ఠ
తృణే ష్వప్సు దధి సర్పిః పయస్సుచ॥ శ్లో॥ తిలౌషధాజినేచైవ పక్వా
పక్వే స్వయం గ్రహః। పణ్యేషు చైవ సర్వేషు నాశౌచం మృతసూ
తకే ఇతి॥ అత్ర। పక్వం = భక్ష్యజాతం। అపక్వం = తండులాది॥ ఏతత్తం
క్వాపక్వా భ్యనుజ్ఞానం అన్నసత్రప్రవృత్త విషయం జ్ఞేయం॥
శ్లో॥ అన్నసత్రప్రవృత్తానాం ఆమ మన్న మగర్హితం। భుక్త్వా పక్వాన్న
మేతేషాం త్రిరాత్రంతు పయః పిబేత్ ఇత్యంగిరోవచనాత్॥

తా.- ఆశౌచముగలవారివద్దనుండి గ్రహించదగిన ద్రవ్యముల
నిరుపదవ వృత్తముచే చెప్పుచున్నాడు - మృతాశౌచమందుగాని, జాతా
శౌచమునందుగాని, కారణాంతరముచే గల్గిన యాశౌచమందు గాని
కూరలు, వంటచెఱకు, చర్మము, ఉప్పు, గడ్డి, పాలు, నీళ్ళు, మాం
సము, పుష్పములు, దుంపలు, ఫలములు, ఓషధులు, పెరుగు, తేనె,
నువ్వులు మున్నగు ఆమద్రవ్యముల కాశౌచములేదు. యజమానియాజ్ఞచే
ఆశౌచములేనివాడు స్వయముగా నితరుల కివ్వవచ్చును. తాను తిన
వచ్చును. అంగడియందు కొనెడి వస్తువుల కన్నింటికిని ఆశౌచము లేదు.

అగ్నే రుపాదేయానుపాదేయత్వ మాహ

21\. జాతారణ్యగ్నినార్వా క్పరిణయనవిధే ర్దగ్ధి రాధానకాలా
దగ్నిహ్యా ణోర్ధ్వంతు విధ్యాహితహుతవహా నై ర్లౌకికే నాగ్న్యభావే

చండాలాగ్నిం చితాగ్నిం పతితహూతభుజం సూతికామేధ్యవహ్నిం
జిహ్వ్య ఘ్రాద్రాహూంతే నేంధనవహనమృతాజ్యైః దాహకో వ్యదాహ॥

వ్యా. ఇదానీ మగ్నే రుపాదేయానుపాదేయత్వం ఏకవింశతివృత్తే నాహ జాతారణ్యాగ్నినేతి- అ న్వా క్వరిణయనవిధేః = వివాహాత్ప్రాక్। జాతారణ్యాగ్నినా। దగ్ధిః = దాహః। కార్యః। జాతారణిః = జాతకర్మసమయే యా అరణిః తన్మథనోత్పన్నే నేతి యావత్॥ వివాహాదూర్ధ్వం। ఆధానకాలాత్ = శ్రౌతాధానాత్। అర్వాక్। గృహ్యేణ = వైవాహ్యే నాగ్నినా। దగ్ధిః। తత ఊర్ధ్వంతు = ఆధానకాలానంతరం। విధ్యాహితహుతవహైః = విధ్యుక్తాధానాజ్యసంస్కారై స్సంస్కృతాయే దక్షిణాగ్న్యాదయ స్త్రయః తై రేవ దగ్ధిః। ఏతేషాం చారణ్యాగ్న్యాదీనా మభావే। లౌకికేన = అసంస్కృతే నాగ్నినా దగ్ధి రి త్యన్వయః॥ తదుక్తం వృద్ధయాజ్ఞ్యవల్క్యేన- శ్లో. ఆహితాగ్నే ర్యథా న్యాయం దగ్ధవ్య స్త్రిభి రగ్నిభిః। అనాహితాగ్ని రేకేన లౌకికే నాపరోజన ఇతి క్వచి ల్లౌకికాగ్న్యపవాద మాహ చండాలాగ్నిమితి- ప్రేతదగ్ధా చండాలాగ్న్యాదీన్ జిహ్వ్యా న్నాపా దద్యాత్॥ తదుక్తం దేవలేన —
శ్లో॥ చండాలాగ్ని రమేధ్యాగ్ని స్సూతకాగ్నిశ్చ కర్హిచిత్। పతితాగ్నిశ్చితాగ్నిశ్చ న శిష్టగ్రహణోచిత ఇతి॥ ఇంధనాద్యపవాదమాహ శూద్రాహృతేనే త్యాదినా - ఇంధనం = కాష్ఠం। గవానః = అగ్నిః। మృతం = ఆజ్యం। ఆది శబ్దేన పయః ప్రభృతి య దుపయుజ్యే త్తత్సంగ్రహః। యోజనా। శూద్రాహృతే నేంధనాదినా యా దాహ స్సో వ్యనాహ ఇతి। యోజనా। అత్ర శూద్రాహృత ఏవేత్యర్థః। తథాహ యమః- శ్లో యస్యానయతి శూద్రోగ్నిం తృణకాష్ఠహవీంషిచ। ప్రేతత్వం హి సదా తస్య స చాధర్మేణ లిప్యత ఇతి॥

తా. ఇప్పు డగ్ని నెవరివలన గ్రహించవచ్చును? ఎవరి వలన గ్రహించరాదు? అను విషయమును 21 వ వృత్తమున చెప్పుచున్నాడు-

వివాహమునకు పూర్వము జాతకర్మకాలము మొదలి యరణిచే మథించబడిన యగ్నిచే దహనము చేయవలెను. వివాహానంతరము శ్రౌతాధానమునకు పూర్వము వివాహాగ్నిచేతనే దహించవలెను. ఆధానానంతరము దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయము నను మూడు శ్రౌతాగ్నులచే దహించవలెను. ఇతరులను లౌకికాగ్నిచేతనే దహించవలెను.

పై విధముననే వృద్ధయాజ్ఞవల్క్యులును వచియించిరి.

ప్రేతను దహించునపుడు చండాలాదులయగ్నులు పనికి రావు. చండాలాగ్ని, (చితాగ్ని) శ్మశానాగ్ని, పతితులయగ్ని, సూతికాగ్ని వీనిని వర్జించవలెను.

ఇంధనాదులయం దపవాదమును చెప్పుచున్నాడు-

శూద్రులచే తీసికొనిరాబడిన కట్టెలు, అగ్ని, నెయ్యి, పాలు మొదలగునవి పనికిరావు. యమధర్మరాజును పై విధముననే వచించెను.

దహనకర్తృత్వాధికారినిర్ణయః, సంస్కారశ్చ

22. సర్వం తూష్ణీం విదధ్యా దుపనయనవిధేః ప్రాక్పరంతు స్వశాఖా
గృహ్యోక్తై స్తద్విధానై స్సకలశవవిధిం జ్యేష్ఠపుత్రో ఽవరో వా
పుత్రాభావే క్రమేణ స్వకులజజననీవంశ్యశిష్యర్త్విజో వా
చార్యో వా యత్ర కుర్యా త్ప్రథమదినవిధిం సోఽపి తత్సూతకాంతమ్॥

వ్యా:- అథ ద్వావింశవృత్తేన దహనేతికర్తవ్యాధికారిణం చాహ సర్వమితి-ఏతత్సర్వం దాహాదికృత్య ముపనయనవిధేః ప్రాక్, తూష్ణీం = అమంత్రక మేవ, విదధ్యాత్॥ తథా చోక్తం లౌగాక్షిణా-శ్లో॥ తూష్ణీమే వోదకం కుర్యా త్తూష్ణీం సంస్కార మేవ చేతి॥ పరం = ఉపనయనానంతరం, స్వగృహ్యోక్తై స్తత్తద్విధానై ర్విదధ్యా దితి స్పష్టం॥ అత్రచ "ఉపేతశ్చే దాహితాగ్న్యవృతార్థవ దితి యాజ్ఞవల్క్యవచన మనుసం

ధేయం॥ ఇదానీ మధికారిణం నిరూపయతి సకలేతి - సకలం = సర్వం శవవిధిం = ప్రథమదిన మారభ్య దశాహాంతం। స్వగృహ్యోక్తం కర్మ, పుత్రో జ్యేష్ఠః పుత్రః అనుపపత్త్యా, అపరో విదధ్యా దితి సంబంధః॥ పూర్వాభావే కర్తృవిశేషం దర్శయతి క్రమేణేతి - క్రమేణ = పూర్వాభావే పర ఇత్యనుక్రమేణ। స్వకులజః = సపిండ స్సోదకో వా । తదభావే, జనన్యాః వంశ్యః = వంశజః। తదభావే శిష్యః తదభావే ఋత్విక్ః తదభావే ఆచార్యోవా విదధ్యా దిత్యన్వయః॥ సకలే త్యనేన దశాహాంతం కర్తృభేదో నకార్య ఇతి సూచితం॥ తథాచ గృహ్యపరిశిష్టే-శ్లో॥ అసగోత్ర స్సగోత్రో వా యది స్త్రీ యదివా పుమాన్। ప్రథమే ఒహని యో దద్యా త్స దశాహం సమాపయేదితి॥ గౌతమ స్మృతిశ్చ- పుత్రాభావే సపిండాః శిష్యాశ్చ దద్యుః। తదభావే ఋత్విగా చార్యా వితి॥ ఇదానీం దేశనియమ మాహ యత్రేతి-యత్ర = యస్మిన్ దేశే। ప్రథమదినవిధిం కుర్యాత్। సోపి = సఏవ దేశః। తత్సూతకాంతం = దశాహపర్యంతం। తత్కర్మార్హ ఇతిశేషః॥ యత్ర ప్రథమదిన కృత్యం కృతం తత్రైవ దశాహపర్యంతం సమాపనీయ మిత్యభి సంధిః॥ అత్ర దేశనియమే శిష్టాచారో మూల మనుసంధేయం॥

తా. ఇరువదిరెండవవృత్తముచేత దహన, కర్తృత్వాధికార నిర్ణయములను చేయుచున్నాడు—ఈదాహాదికృత్యము లుపనయనవిధికి పూర్వము అమంత్రకముగ జరుపవలెను. ఉపనయనానంతరము స్వగృహ్యోక్తవిధానములచే సమంత్రకముగ జరుపవలెను. పై విధము ననే యాజ్ఞవల్క్యులును వచియించిరి. దహనాధికారిని నిరూపించు చున్నాడు- ప్రథమ దినము మొదలు, దశాహాంతమువరకు సమస్తకర్మను జ్యేష్ఠకుమారు డాచరించవలెను. అతడు దగ్గరలేనిచో చిన్నవాడైనను చేయవచ్చును.

పుత్రులులేనిచో కర్తృక్రమమును చెప్పుచున్నాడు. పుత్రులు లేనిచో సపిండులు, వారులేనిచో సమానోదకులు, వారు లేనిచో తల్లి వంశమువారు, వారును లేనిచో, వరుసగా శిష్యుడు, ఋత్విక్కు, గురువు కర్త లగుదురు కర్తృభేదము చేయరాదు. అసగోత్రుడుగాని, సగోత్రుడుగాని, స్త్రీగాని, పురుషుడుగాని మొదటిరోజున నెవడు కర్తయో, వాడే దశాహాంతమును నిర్వర్తించవలెనని గుహ్యపరిశిష్ట మున గలదు. గౌతములవారును నట్లే వచించిరి.

దేశనియమమును చెప్పుచున్నాడు- ఏదేశమందు ప్రథమదిన కృత్యమును నిర్వర్తించిరో ఆప్రదేశమందే దశాహాంతకర్మను చేయుట ముఖ్యము. దేశనియమనిర్ణయమున శిష్టాచారము ననుసరించవలెను.

నోటు:- దహనము జరిగినచోటనే సంచయనమునుచేసి, మిగత కర్మ నవసరమైతే మరియొకచోట నాచరించుట శిష్టాచారము గలదు.

స్మృతిసారసముచ్చయే కర్తృపరంపరా

శ్లో. పితుః పుత్రేణ కర్తవ్యాః పిండదానోదకక్రియాః।
పుత్రాభావేతు పత్నీ స్యాత్ పత్న్యభావేతు సోదరః॥

సంగ్రహే—

శ్లో. పుత్రః కుర్యాత్పితుః శ్రాద్ధం పత్నీతు తదసన్నిధౌ।
ధనహార్యథ దౌహిత్రః తతో భ్రాతాచ తత్సుతః॥

విష్ణుః—

శ్లో. పుత్రః పౌత్రశ్చ తజ్జశ్చ పుత్రికాపుత్రఏవచ।
పత్నీ, భ్రాతాచ, తజ్జశ్చ, పితా, మాతా స్నుషా తథా॥

శ్లో. భగినీ, భాగినేయశ్చ సపిండ స్సోదక స్తథా।
అసన్నిధానే పూర్వేషా ముత్తరే పిండదా స్స్మృతాః॥

శ్లో॥ పితుః పుత్రేణ కర్తవ్యాః పిండదానోదకక్రియాః॥
పుత్రాభావేతు పత్నీ స్యాత్ పత్న్య భావే తు సోదరః॥
పుత్రాభావే = పుత్రపౌత్రా ద్యభావ ఇత్యర్థః॥

పత్నీ,భ్రాతా చేతి విభక్తభ్రాతృవిషయః॥ అవిభక్తభ్రాతృవిషయే భ్రాత్రసంతరమేవ పత్నీ॥ శ్లో॥ పితామహస్య యచ్ఛ్రాద్ధం షోడశాది సపిండనం। అపుత్రస్యతు కర్తవ్యం పౌత్రేణ ప్రథమాబ్దికం॥ వృత ప్రకత్యాబ్దికం తస్య వర్షేవర్షే న విద్యతే॥

తా:- తండ్రికి కుమారుడు పిండదానోదకక్రియల నాచరించవలెను. పుత్రులులేనిచో భార్య, భార్య లేనిచో సోదరుడును కర్తలగుదురు.

సంగ్రహమునం దీక్రిందివిధమున గలదు- తండ్రికర్మను కుమారుడు చేయవలెను. కుమారుడువగ్గరలేనిచో భార్య, భార్యలేనిచో ధనమును హరించు దౌహిత్రుడు, అనంతరము సోదరుడు, తదుపరి సోదరపుత్రుడు కర్త లగుదురు.

విష్ణు వీక్రిందివిధమున వచించెను- పుత్రుడు, పౌత్రుడు, పౌత్రుని కుమారుడు, కుమార్తె, 'పుత్రికైవ పుత్రః పుత్రికాపుత్రః' అని పెద్దలు వ్యాఖ్యానముచెప్పిరి - అనగా పుత్రికయే - పుత్రుడు అనగా కుమార్తెయే కర్త యని యర్థము—.

పుత్రుడు, పౌత్రుడు, అతనికుమారుడు, కుమార్తె, ఆమెకుమారుడు (దౌహిత్రుడు) అని వరుసచెప్పవచ్చును. ఎందువల్లననగా'' అపుత్రస్యతు యాపుత్రీ సైవ పిండప్రదా భవేత్'' అనుటచేత కుమారుడు దగ్గరలేనిచో భార్య, ఆమెలేనిచో ధనహారియగు దౌహిత్రుడు ననుట చేత ద్రవ్యము నమభవించునట్టియు, వివాహకాలమున

శ్లో:- అభ్రాతృకాం ప్రదాస్యామి తుభ్యం కన్యా మలంకృతామ్।
అస్యాం యో జాయతే పుత్రః స మే పుత్రో భవే దితి॥

అను సంకల్పపూర్వకముగా కన్యాదానముచేసిన కన్యకకు జన్మించిన నియమిత దౌహిత్రుని విషయమనియు, నియమిత దౌహిత్రుడును ధనహారియు కానిచో కుమారేతర్వాతనే దౌహిత్రుడు కర్తయనియు పెద్దలు వచించిరి.

భార్య, సోదరుడు, సోదరునికుమారుడు, తండ్రి, తల్లి, కోడలు, సోదరి, మేనల్లుడు, సపిండుడు, సోదకుడు, పూర్వుల యసన్నిధానమందుత్తరోత్తరులు కర్తలగుదురు. తల్లిదండ్రులకు కుమారుడు పిండదానోదకక్రియల నాచరించవలెను. పుత్రులు లేనిచో భార్య, భార్య లేనిచో సోదరుడు కర్త లగుదురు. పుత్రాభావే అనగా, పుత్రపౌత్రాదులు లేనిచో నని యర్థము. పత్నీ, భ్రాతా, యను వరుస విభక్తభ్రాతృ విషయము. సోదరు లవిభక్తులైనచో సోదరునియనంతరమే భార్య కర్తయగును. అపుత్రుడైన పితామహునికి పౌత్రుడు, షోడశసపిండాదిశ్రాద్ధముల నాచరించి, మాసికములను పెట్టి, సంవత్సర విమోక ప్రథమాబ్దికముల నాచరించవలెను. ప్రతిసంవత్సరమును వేరుగా ప్రత్యాబ్దికము నాచరించనక్కరలేదు - తండ్రియాబ్దికమునాడు పరంపరలో చేరునుగనుక.

ధర్మసంగ్రహబోధిన్యాం 29 పుటే - ధర్మసింధౌ శ్రాద్ధాధికార నిర్ణయే 46 పుటేచ—

వాక్యం:- తత్ర సోదరాసోదరసమవాయే సోదర ఏవ। తత్రాపి జ్యేష్ఠకనిష్ఠయో స్సత్వే కనిష్ఠ ఏవ॥

తా. మరణించినవానికి కనిష్ఠసోదరుడు లేనిచో, జ్యేష్ఠసోదరుడే కర్తయగును. కనిష్ఠసోదరులు చాలమందియున్నచో, చనిపోయినవాని తర్వాత తమ్ముడు కర్త యగును. అతనులేనిచో వానితర్వాతవాడును,

అతడు లేనిచో వానితర్వాతవాడును కర్త లగుదురు. కనిష్ఠసోదరులు లేనిచో, మరణించినవానికి పై జ్యేష్ఠుడు, వాడు లేనిచో వతనికి పై వాడు ఈ విధముగా పైకి వెళ్ళవలెను.

శ్లో॥ పుత్రాభావేతు కుర్యాతాం భర్తృభార్యే పరస్పరం।
అపుత్రస్య తు యా పుత్రీ సైవ పిండప్రదా భవేత్॥

వాక్యం:- భర్త్రభావే దుహితా మాతుః కుర్యాత్॥పత్న్యభావే పితు శ్చేత్యర్థః॥ పిత్రుధనభాక్త్వంచ తస్యాః స్మర్యతే దేవలేన-''అపుత్రకస్య స్వం కన్యాధర్మజాపుత్రవ ద్ధరేత్ ॥ కన్యా = ఊఢా. అనూఢాచ॥

శ్లో॥ యథైవాత్మాదవా పుత్రః పుత్రేణ దుహితా సమా।
తస్యా మాత్మని తిష్ఠంత్యా। కథ మన్యో ధనం హరేత్॥

శ్లో॥ పత్నీ దుహితరశ్చైవ। పితరౌ భ్రాతర స్తథా
ఇతి ధనగ్రహణే క్రమస్మరణాచ్చ పత్న్యాదుహితుశ్చ దౌహిత్రా త్పూర్వభావిత్వ మాహుః॥ యశ్చార్థహర స్సపిండదాయీ॥

తా.— పుత్రులులేనిచో భర్తకు భార్య. భార్యకు భర్త కర్త లగుదురు. పుత్రులులేనివారికి పుత్రికయే పిండప్రదురా లగును. పుత్రికగూడ లేనిచో, ధనహారి యగు సన్నిహిత సపిండుడే కర్త యగును. ధనహారియే ముఖ్యకర్త. ఒకప్రేతకు దౌహిత్రుడుకాని, మరియొకడుకాని కర్మచేసినచో ప్రేతత్వవిముక్తి కలుగును. జ్ఞాతులు మరల చేయనవసరము లేదు. అవిభక్తసోదరులలో జ్యేష్ఠుడు మరణించిన వానితర్వాతవాడు కర్తయగును. కనిష్ఠుడు చనిపోయిన వానికి పై వాడు కర్త. 3 వ వాడు పోయిన 2 వ వాడు. 4 వ వాడు పోయిన 3 వ వాడు -. ఇట్లే కర్తలగుదురని శిష్టవచనము. వైద్యనాథదీక్షితీయమున విపులముగా జూడనగును.

శ్లో:- జ్యేష్ఠభ్రాతుశ్చ భార్యాయాః సాపత్నీ మాతురేవచ।
పిత్రో రాబ్దికవ త్కుర్యా న్నష్టే కర్తరిపై యది॥

తా.— జ్యేష్ఠభ్రాతకు, వదినభార్యకు, తనభార్యకు, సపత్నీ మాతకు కర్త నష్టమైనను తల్లిదండ్రుల యాబ్దికమువలె యథావిధిగా నాచరించవలెను.

శిశుమరణే ఖననవిధిః

23. ఆ నామ్నః ఖానమాత్రం నజలహుతవహౌ నామవర్షత్రయాంతః కామం చోర్ధ్వంతు నిత్యౌ భవత ఉపరతే౽ చౌలకే చౌలయుక్తే నిత్యౌకాలావిశేషా దథ పితృముఖరాః స్నాపయిత్వాంబరస్రక్ గంధాద్యైః శోభయిత్వా మృత మథ ఖననే యోగ్య మాజ్యై ర్విలిప్య॥

వ్యా.—అనామ్న ఇతి - నామకరణా త్ప్రాక్। ఉపరతే = మృతే। ఖానమాత్రం = ఖనన మేవ। మాత్రశబ్దార్థం స్పష్టయతి। న జలహుత వహౌ ఇతి స్పష్టం। నామవర్షత్రయాంతః। నామ = నామకరణం। తత ఆరభ్య। వర్షత్రయాంతః = వర్షత్రయమధ్యే। ఉపరతే। జలహుతవహౌ। కామం = స్వేచ్ఛయా। అనుష్ఠేయౌ। న నియతౌ। ఊర్ధ్వం = వర్షత్రయాదనంతరం తు। అకృతచూడే వ్యుపరతే। నిత్యౌ = నియతౌ భవతః। కృతచూడేతు విశేషమాహ- చౌలయుక్తే నిత్యౌ కాలావిశేషా దితి - కాలావిశేషాత్ = వర్షత్రయాత్ ప్రాగపి కృతచూడే నిత్యా విత్యర్థః॥ ఖననవిధి మాహ అథేతి - పితృముఖరాః = పితృముఖ్యాః। ఖననే యోగ్యం = నిఖననార్హం ప్రేతం స్నాపయిత్వా। అథ = అనం తరం। అంబరస్రగ్గంధాద్యైః శోభయిత్వా। ఆజ్యై ర్విలిప్య। నిఖనేయు రితి శేషః॥ అత్ర మూలం- శ్లో. ఊనద్విపర్షం నిఖనే న్నకుర్యా దుదకం తత ఇతి యాజ్ఞవల్క్యవచనం॥ తథా - శ్లో. ఊనద్విపార్షికం ప్రేతం నిదధ్యు ర్బాంధవా బహిః। అలంకృత్య శుచౌ భూమా వస్థిసంచయనా

దృతేః శ్లో. నాస్య కార్యోగ్నిసంస్కారో నాస్య కార్యోదకక్రియా। అరణ్యే కాష్ఠవత్ త్యక్త్వా క్షిపేయు స్త్ర్యహమేవతు ఇతి మనువచనాత్ ॥ తథా- శ్లో ఊనద్వివార్షికం ప్రేతం ఘృతాక్తం నిఖనే ద్బహిః యమగాథా గాయమానో యమసూక్త మనుస్మర న్నితి యమసహిరణం వాపి మూల మి త్యనుసంధేయం॥

తా.— శిశువు నామకరణమునకు పూర్వము చనిపోయినచో ఖననమాత్రమే. మాత్రశబ్దమువలన దహనముగాని, నీటియందు విడచుటగాని పనికిరాదని యర్థము. నామకరణానంతరము మూడుసంవత్సరములు వెళ్ళలోపల మరణించినచో దహనముగాని, జలమందు విడచుటగాని స్వేచ్ఛగా ఆచరించవచ్చును. నియమము లేదు. 3 సంవత్సరములు దాటినపిమ్మట చూడాకర్మచేయబడక మరణించినను జల, హుతవహములు నిత్యములు. చూడాకర్మజరిగినవానివిషయమై విశేషమును చెప్పుచున్నాడు. చూడాకర్మజరిగినవాడు 3 సంవత్సరములు నిండకపూర్వము మరణించినను దహనము, జలమునందు విడచుట ముఖ్యములు.

ఖననవిధిని చెప్పుచున్నాడు- తండ్రి మొదలగు ఆబంధువులు, ఖననార్హుడైన ప్రేతను స్నానముచేయించి, యనంతరము వస్త్రము, పూలదండలు, గంధము మున్నగువానిచే నలంకరించి, నేతినిపూసి ఖననముచేయవలెను. పై విధముననే యాజ్ఞవల్క్య, మను, యమ వాక్యములు గలవు.

అవ, శవనయనే నగరస్య ద్వారవిశేషనిర్ణయః—

24: ప్రత్యగ్ద్వారా న్నగర్యా బహి రవనిసురం క్షత్రియం తూత్తరేణ ప్రాగ్ద్వారేణైవ వైశ్యం పితృదిశి వృషలం నాయయిత్వామయాయుః వర్జ్యః పూర్వ మూనద్విశరదుపరతా నానుయానే నియామః శూద్రై 9 స్సపృష్టోథ వోఢా యది భవతి మృతః ప్రేతభా[illegible]

వ్యా.— ఇదానీం శవనయనే వర్ణవిశేషేణ ద్వారవిశేష మాహ ప్రత్యగ్ద్వారేతి అవనిసురం = బ్రాహ్మణం మృతం। నగర్యాః ప్రత్యగ్ద్వారాత్ = పశ్చిమద్వారేణ। బహిర్నాయయిత్వా। సర్వే జ్ఞాతయః వర్షీయః పూర్వం = వృద్ధపురస్సరం। యథా భవతి। ఏవం। అనుయాయుః = అనుగచ్ఛేయుః। అయ మగనుమననియమో ద్వివర్షాధిక వయో మృతా జ్ఞేయః॥ తథాహ యాజ్ఞవల్క్యః- శ్లో. ఆశ్మశానా దనువ్రజ్య ఇతరో జ్ఞాతిభి ర్మృత ఇతి॥ క్షత్రియం తూత్తరద్వారేణ। వైశ్యంతు ప్రాగ్ద్వారేణ। వృషలం = శూద్రం। పితృదిశి = దక్షిణస్యాం దిశి। యత్ ద్వారం। తేన నాయయిత్వా। సర్వే జ్ఞాతయః వర్షీయః పూర్వం = వృద్ధ పురస్సరం। అనుయాయు రిత్యన్వయః। తథాచ స్మృతిః- శ్లో. దక్షిణేన మృతం శూద్రం పురద్వారేణ నిర్హరేత్। పశ్చిమోత్తరపూర్వైస్తు యథాసంఖ్యం ద్విజాతయ ఇతి॥ ఇదానీం వయోవిశేష మృతస్య, అనుగమననియమాపవాదమాహ ఊనద్విశరదుపరతా వితి- ఊనద్విశర దుపరతా = ఊనద్వివార్షికమృతా సత్యాం। అనుయానే= అనుగమనే। అనియమః = నియమో నాస్తి॥ తదుపరతా వనుగమన కర్తవ్యతానావశ్యకీ భవ తీతి యావత్। అత్రాపి పూర్వోక్తా యాజ్ఞవల్క్యస్మృతి ర్మూలం ॥ అథశూద్రకృతస్పర్శవహనయో ర్దోషమాహ శూద్రైః స్పృష్టోధవో ఢో యదీతి- యదిమృతః ప్రేతః,శూద్రైః స్పృష్టో ధవా ఊఢో భవతి। తదా, తస్య ప్రేతభావా న్న ముక్తిః । ఏతత్తు సత్సు బ్రాహ్మణాది ష్వితి జ్ఞేయం॥ తథాచ మనుః శ్లో. న విప్రం స్వేషు తిష్ఠత్సు మృతం శూద్రేణ హారయేత్। అస్వర్గ్యా హ్యాహుతి స్సా స్యాచ్ఛూద్రం సంస్పర్శ్య దూషితేతి॥

తా.— ఇప్పుడు శవమునుతీసికొనిపోవు విషయమై వర్ణవిశేష ముచే ద్వారవిశేషమును చెప్పుచున్నాడు - చనిపోయినబ్రాహ్మణుని పట్టణముయొక్క పడమర ద్వారమున బయటికి తీసికొనిపోయి జ్ఞాతు

లందరును వృద్ధపురస్సరముగా వెంటవెళ్ళవలెను. ఈ యనుగమనవి యమము 2 సంవత్సరములు దాటినవానికేగాని లోపువారికి లేదు. క్షత్రియుని ఉత్తరద్వారమునను, వైశ్యుని తూర్పుద్వారమునను, శూద్రుని దక్షిణ ద్వారమునను తీసికొని వెళ్ళవలెను. మృతుడు శూద్రులచే తాకబడినను, వహించబడినను వానికి ప్రేతత్వవిముక్తి లేదు. బ్రాహ్మణు లుండగా శూద్రులచే వహింపజేయరా దని మనువు వచించెను.

ఉదకదానే విహిత పురుషనిర్ణయః

25. జ్ఞాతీనాం మాతృపిత్రో రపి పరమగురో ర్నిత్య మంభోఽత్ర మిత్ర ప్రత్తాస్వస్రీయ మాత్స్వశ్వశురగురుసుహృత్ యాజకానాం యథేచ్ఛం సవ్రాత్యబ్రహ్మచారి వ్రతియతిపతితక్లీబపాషండచోరా దద్యు ర్నైత్వత్ర పిండానలజలకథనానర్హకా స్తేతు సూక్తాః॥

వ్యా:— ఇదానీ ముదకదానే విశేషం పంచవింశేన వృత్తేనాహ జ్ఞాతీనామితి-జ్ఞాతయః = సపిండాః సోదకాశ్చ। మాతాపితరౌ ప్రసిద్ధౌ। పరమగురుః = ఆచార్యో మాతామహశ్చ। ఏషాం। అంభః = ఉదకదానం। నిత్యం। అయ మర్థః - సపిండానాం సపిండోద్దేశేన। సోదకానాం సోదకోద్దేశేన। పుత్రస్య మాతాపిత్రాద్దేశేన। బ్రహ్మచారిణ ఆచార్యోద్దేశేన। దౌహిత్రస్యచ మాతామహోద్దేశేవ. య దుదకదానం। త న్నిత్యమితి। యథాహ యాజ్ఞవల్క్యః-శ్లో॥ సప్తమా ద్దశమాద్వాపి జ్ఞాతయోఽభ్యుపయంత్వప ఇతి ॥ ఏవం మాతామహాచార్య ప్రేతానాముదకక్రియేతి॥ ఇతరత్ర నియమాభావ మాహ అథ మిత్రేతి-మిత్రం = సఖా। ప్రత్తా = పరిణీతా। దుహితా, స్వసా, స్వస్రీయాదయః ప్రసిద్ధాః। ఏషామంభోదానం। యథేచ్ఛం = ఇచ్ఛయా భవతి। న నియతం। తథాహ యాజ్ఞవల్క్యః। శ్లో॥ కామోదకం సఖిప్రత్తాస్వస్రీయశ్వశురర్త్విజా

మితి॥ తేషాంచిదుదకదానే కర్తృత్వాపవాదమాహ నవ్రాత్యైస్త్యాదినా. వ్రాత్యాః = సావిత్రపతితాః । బ్రహ్మచార్యాదయః- ప్రసిద్ధాః । ఏతే ప్రేతాయోదకం న దద్యురి త్యన్వయః। తే. క ఇత్యపేక్షాయామాహ యేత్వితి- యే త్వత్ర ప్రేతప్రసంగే పిండానలంజలికథనానర్హాః । పిండాద్యయోగ్యా స్తే ప్యుదకాని న దద్యురితి॥ తేపి కే ఇత్యాకాంక్షాయామాహ తేత్వితి- తే- పునస్తూక్తాః = పూర్వోక్తా ఏవ॥ తథా చ స్మృతిః

శ్లో॥ న బ్రహ్మచారిణః కుర్యుః ఉదకం పతితా న చేతి॥ వృద్ధమను రపి.

శ్లో॥ క్లీబాద్యానోదకం దద్యుః స్తేనా వ్రాత్యావిధర్మిణః॥ గర్భభర్తృద్రుహశ్చైవ సురాప్య శ్చాపి యోషిత ఇతి॥

తా:- ఇనునదియైనవ వృత్తముచే నుదకదానమునందలి విశేషమును చెప్పుచున్నాడు. సపిండులు, సోదకులు, తల్లిదండ్రులు, ఆచార్యుడు, మాతామహుడు వీరల కుదకదానము నిత్యమైనది. సపిండులకు సపిండోద్దేశ్యముచేతను, సోదకులకు సోదకోద్దేశ్యముచేతను, పుత్రులు తల్లిదండ్రుల నుద్దేశించియు, బ్రహ్మచారి ఆచార్యు నుద్దేశించియు, దౌహిత్రుడు మాతామహు నుద్దేశించియు నుదకదానము నిత్యమని యర్థము. యాజ్ఞవల్క్యుడును పైవిధముననే వచించెను.

ఇతరత్ర నియమాభావమును చెప్పుచున్నాడు. స్నేహితుడు, వివాహితురాండ్రైన కూతుండ్రును, సోదరి, మేనల్లుండ్రు, వీరల కుదకక్రియ యథేచ్ఛము. నియమము లేదు. యాజ్ఞవల్క్యుడు పైవిధముననే వచించెను.

కొందఱి కుదకదానమునందు కర్తృత్వాపవాదమును చెప్పిరి. వ్రాత్యుడు, బ్రహ్మచారి, వ్రతి, యతి, పతితుడు, క్లీబుడు, పాషండుడు, చోరుడు ఇట్టివారు ప్రేత నుద్దేశించి యుదకదానమును చేయరాదు. వా రెవరనెడి నుపేక్షపై చెప్పుచున్నారు- ఎవరు ప్రేతవిషయమై పిండ

లవం. జలాదుల నిచ్చుట కనర్హులో, వారున్నూ ఉదకాదుల నివ్వ-
రాదని యర్థము. పై విధముననే వృద్ధమనువుకూడ వచించెను.

దహనానంతరక్రియా మహ

౧౭. సంస్కృత్యాఽనీక్షమాణాః సకలకులభువో బాలపూర్వం ప్రతీతా
నాదే యే వృద్ధపూర్వం పయసి సవసనా ఏకవారం నిమజ్య।
పాషాణే త్రి స్సకృద్వా ప్రతిదిన ముదకం బ్రాహ్మణే దక్షిణాస్యాః।
క్షత్రే తూదఙ్ముఖావై మృతవతి విశితు ప్రాఙ్ముఖా స్తే దదీరన్॥

వ్యాః- అథ షడ్వింశవృత్తేన సంస్కారానంతరం యత్కార్యం తదాహ సంస్కృత్యేతి- సకలకులభువః = సర్వే జ్ఞాతయః। బాలపూర్వం = బాలప్రముఖాః। ప్రేతం।సంస్కృత్య = దాహయిత్వా।సంస్కారస్థలిం అనీక్షమాణాః।నాదేయే పయసి ప్రతీతాః। వృద్ధపూర్వం — వృద్ధపురస్సరం యథా భవ త్యేవం = సవసనాః = సవస్త్రాః। ఏకవారం నిమజ్య। పాషాణే। త్రిః = త్రివారం। సకృత్ = ఏకవారంవా। ప్రతిదినం = ప్రత్యహం। దశదినావధి। ఉదకం దదీర న్నితి సంబంధః॥ ఉదకదానే వర్ణభేదేన దిఙ్నియమం విశదీకర్తుం తా విశినష్టి బ్రాహ్మణేత్యాదినా- బ్రాహ్మణే మృతవతి దక్షిణాస్యాః = దక్షిణాభిముఖాః॥ క్షత్రియే మృతవతి తూదఙ్ముఖాః। విశి = వైశ్యే। మృతవతి। ప్రాఙ్ముఖా ఇతి। అత్రమూలం-యథావిభాగ మగ్నౌ శరీరం యోజ్య। 'అనవేక్షమాణా అపోభ్యువయం'తీతి శాతాతపస్మృతిః॥ ప్రేతస్య బాంధవా యథా వృద్ధ ముదక మవతీర్య. నో ద్ధర్షయేయు రుదకాంతే ప్రసించేయు రతి సవ్యయజ్ఞోపవీతవాసః దక్షిణాభిముఖా బ్రాహ్మణస్య। ఉదఙ్ముఖాః ప్రాఙ్ముఖాశ్చ క్షత్రియవైశ్యయో రితి ప్రచేతోవచనంచ। తదా సకృత్ప్రసించ న్త్యుదకం నామ గోత్రేణ వాగ్యతా ఇతి యాజ్ఞవల్క్యస్మృ

రపి త్రిప్రపేకం కుర్యుః ప్రేత స్తృప్య త్వితి ప్రచేతోవచన మపి మూం
మిత్యమపంధేయం॥.

తా:- 26 వ వృత్తముచే వంస్కారానంతరకృత్యమును చెప్పు
చున్నాడు. జ్ఞాతులందరును, కాలపూర్వకముగా ప్రేతను సంస్కరించి,
వంస్కారస్థలమును తిరిగి చూడక, నదియొద్దకు వెళ్ళి, సవస్త్రులై వృద్ధ
పూర్వకముగా నొకమారు మునిగి, శిలయందు ముమ్మారుగాని, యొక
మారుగాని పదిరోజులును రోజు కొక మారుగాని, ముమ్మారుగాని,
యుదకమునీయవలెనని సంబంధము. ఉదకదానమునందు వర్ణభేదముచే
దిఙ్నియమమును చెప్పుచున్నాడు. బ్రాహ్మణ ప్రేతకు దక్షిణాభిముఖము
గను, క్షత్రియునికి ఉత్తరముఖముగను, వైశ్యునికి పూర్వముఖము
గను నుదకమునీయవలెను. శాతాతపస్మృతియందును. ప్రచేతోవచనము
వందును. యాజ్ఞవల్క్యస్మృతియందును వైవిధమునవె వివరింపబడినది

స్నానానంతరక ర్తవ్యవిధిః

27. స్నాయు ర్భూయోపి తత్ర త్రినిశ మనశనా జ్ఞాత మోహర్నిశంవా
క్రీతోత్పన్నాశనా వా విషలవణపయఃక్షార మన్నం త్యజేయుః
స్త్రీసంగం మంగళాది వ్యసనహసన ముద్రోదనోచ్చాసనాది
శార్ణా పీర్ణకితా తే పృథగతినియతా స్సంవిశేయు ర్నిశాయామ్॥

వ్యా:— ఇదానీ ముదకదానానంతరం యత్కార్యం తత్సప్త
వింశేన వృత్తే నాహ స్నాయు రితి జ్ఞాతయ స్తత్ర వయసి భూయో
ప్యుదకదానానంతరంపునరపి స్నాయుః = స్నానంకుర్యుః।తత సై ర్యత్క
ర్తవ్యం తదాహ త్రినిశ మితి-త్రినిశం = త్రిదినం। అనశనాః =
అభోజనా స్సన్తః। అహర్నిశం = ఏక మహోరాత్రంవా। అనశనా,
క్రీతోత్పన్నాశనా వా సంతః। క్రీతం = క్రయేణ ప్రాప్తం। ఉత్పన్నం =
అయాచితప్రాప్తం। తదశవా। అవిష, లవణ పయః క్షార మన్నం

త్యజేయుః। ఏతత్ స్పష్టం। తథా స్త్రీసంగం మంగలాని వ్యసనం హసనం చ త్యజేయు రితి సంబంధః। తథా ఉచ్చాదోదవో ద్వాస వా వ్యపి త్యజేయు రితి పూర్వేణసంబంధః॥ అథ నిశాకృత్య మాహ తార్ణా స్తీర్ణ ఇతి ఇతి-తార్ణం = తృణనిర్మిత మాస్తరణం। తే నా స్తీర్ణాః = ఆచ్ఛాదితాః। యా ఇతి ర్భూమిః। తత్రాతి నియతాః = బ్రహ్మచర్యాది నియమయుక్తాః। పృథక్ నిశాయాం। సంవిశేయుః = స్వపేయుః। స్పష్ట మన్యత్। అత్రచ, క్రీత, లబ్ధాశనా భూమౌ, స్వపేయుః। స్తే పృథక్ పృథ గితి యాజ్ఞవల్క్య వచనం 'తథాగృహాన్ప్రవిశ్యాథ ప్రవస్త్రే త్ర్యహ మనశ్నంత ఆశీరన్। క్రీతోత్పన్నేన వా వర్తేర న్నితి'' వసిష్ఠ వచనం। నైతస్యాం రాత్ర్యా మన్నం పచేరన్। క్రీతోత్పన్నేన వా వర్తేర న్నిత్యాశ్వలాయనవచనం॥ తథా ఉక్షారాలవణా న్నా-స్యు ర్నిమజ్జంతియు శ్చ తే త్ర్యహం! మాంసాశనంచ నాశ్నీయుః శయీరం స్తే ఇతా వితి మనువచనం॥ తథా అథ శ్మా మాసవనియమో బ్రహ్మచారిణశ్చ సర్వ ఇతి గౌతమవచనం మూల మి త్యనుసంధేయం॥

తా:— 27 వ వృత్తముచే సుదకదానానంతర కృత్యమును చెప్పుచున్నాడు — జ్ఞాతు లుదకదానానంతరము మరల స్నానము చేయవలెను. 3 దినములైనను లేక యొక దినమైనను భోజనము మానివేయవలెను. లేనిచో విక్రయాన్నమునుగాని, అయాచితప్రాప్తాన్నమును గాని భుజించవలెను. మాంసము, ఉప్పు, పాలు, కారము వీనిని వర్జించవలెను. స్త్రీసాంగత్యమును, మంగళద్రవ్యములను, మాంగల్యావిషయములను, ఇతరవ్యసనములను, నవ్వుట- వీనిని త్యజింపవలెను, ఎక్కువగా నేర్చుట, ఉన్నతాసనముపై కూర్చుండుట ఇవి పనికిరానివి. రాత్రికృత్యము చెప్పుచున్నాడు- గడ్డిచే నిర్మించబడిన చాపను భూమిపై పరచుకొని బ్రహ్మచర్యాదినియమయుక్తులై రాత్రులయందు వేరువేరుగా

విద్రించవలెను. పై విధమునకే యాజ్ఞవల్క్య, వసిష్ఠ, ఆశ్వలాయన మను, గౌతమ వాక్యములును గలవు.

## దశాహసంబంధ విధినిర్ణయం

28 . సంస్కర్తాదర్భపుంజే సమధు దహనతః ప్రత్యహం పిండ మేకం. భూమా వేహావ యేత ప్రథమదిన చరుద్రవ్య మే వోపరిష్టాత్ దాహాహ్నాదేవ గణ్యం చయనదిన మిదం చాధితోహ్నాం చతుర్ణా మేకస్మిం త్సప్త మేవా ఒహని నవమదినే వాను పేతేతు నైతత్॥

వ్యా-ఇదానీందశాహసంబంధివిధి మష్టావింశేన వృత్తేనాహ సంస్కర్తేతి-సంస్కర్తా = దాహకః॥ దహనం = దహనానంతరం, ప్రత్యహం = ప్రతిదినం, దశాహావధి । దర్భపుంజే = భూమా వే వస్తృతదర్భసముదాయే। ఏకైకపిండం। సమధు యథా భవతి తథా, ఆవ యేత్ = దద్యాత్॥తథా స్మృతిః-నవభి ర్దివసై ర్దద్యా న్నవపిండాన్ సమాహితః॥ దశమం పిండ ముత్సృజ్య రాత్రిశేషే శుచి ర్భవే దితి॥ అత్ర భూమా విత్యనేన పాషాణాదివ్యావృత్తి స్సూచితా॥ తథోక్తం శంఖేన- భూమౌ మాల్యం, పిండం, పానీయం, అనులేపనంచ దద్యు రితి॥ పిండ దానే ద్రవ్యనియమ మాహ ప్రథమేతి- ప్రథమదినే యచ్చరుద్రవ్యం తదేవోపరిష్టా ద్యావ ద్దశాహం కార్యం। నతు ద్రవ్యాంతర ముపాదేయ మితి యావత్॥ తదుక్తం శునఃపుచ్ఛమునినా-శ్లో॥ శాలినా సక్తుభి ర్వాపి శాకై ర్వా ప్యథ నిర్వపేత్। ప్రథమేహాని యద్ద్రవ్యం తదేవ స్యా ద్దశాహక మితి॥ అధ చయనకాల మాహ- దాహాహ్నాదేవేతి- చయన దినం దాహాహ్నాదేవ గణ్యం। నతు మరణదినాత్॥ శ్లో॥ అస్థిసంచయనం దాహాత్ మృతాహస్తు యథాతిథీ త్యంగిరోవచనాత్॥ ఇదంచ చయన మాదితః = దాహాదినతః॥ యాని చత్వారిదినాని। తేషాం చతుర్ణాం దివసానాం మధ్యే ఏకస్మిన్ దినే, దాహతః సప్తమే వాహ్ని, నవమే

వా కార్య మితి శేషః॥ తథాచ సంవర్తః- ప్రథమేహ్ని తృతీయే వా సప్తమే నవమే పివా। అస్థిసంచయనం కార్యం దినే తద్గోత్రజైస్సహేతి॥ స్మృత్యంతరంచ - శ్లో॥ ద్వితీయే హ్యస్థిసంచయ ఇతి విష్ణురపి॥ చతుర్థే దివసేఽస్థిసంచయనం కుర్యాత్తేషాంచ గంగాంభసి ప్రక్షేప ఇతి॥ అనుపేతేతు నైత దితి - అనుపేతే = అనుపనీతే, దగ్ధేఽపి, ఏతదస్థిసంచయనం న కార్య మిత్యర్థం॥

తా :- దశాహ సంబంధవిధి నిరుపది యొనిమిదవ వృత్తముచేత చెప్పుచున్నాడు- దహనసంస్కారమును చేసినవాడు, దహనానంతరము ప్రతిదినమును, పదియవరోజూపరకు, భూమిపై దర్భలు పరచి, ఒక్కొక్కపిండమును తేనెతోగాని, బెల్లముతోగాని కలిపి ఉంచవలెను. దహనాది పదిదినములును భూమియందే, పుష్పమాలిక, పిండము, పానీయము, అనులేపనము నీయవలెనని శంఖవచనము. ప్రథమదినమున నే యే ద్రవ్యములను పిండమునందు కలిపిరో, దశాహాంతము నా ద్రవ్యములనే కలుపవలెనుగాని మార్చరాదు. వైవిధముననే శునఃపుచ్ఛ మహాముని కూ వచించెను.

బియ్యము, పెసరపప్పు, నెయ్యి, పెరుగు, బెల్లము, అల్లము కలుపుట ఆచారము గలదు.

సంచయనదినమును చెప్పుచున్నాడు- సంచయనదినము సుదహన దినమునుండియే లెక్కించవలెను. మరణదినమునుండి లెక్కించరాదు, అస్థిసంచయనము దహనదినమునుండియు, మృతాహస్సు మరణదినము నుండియు లెక్కింపకొనవలె నని యంగిరోవచనము. ఈ సంచయనము దహనాది 4 దినములలో నే దినమునసైనను చేయవచ్చును. అట్లు వీలు కానిచో దహనాది 7 లేక 9 దినములయందు చేయవచ్చును. 1, 3, 7, 9 దినములయం దస్థిసంచయనము చేయవచ్చునని సంవర్తుని వచనము. 2వ రోజునకూడ చేయవచ్చునని స్మృత్యంతరము కలదు. విష్ణు వీ

క్రిందివిధమున నుడివెను. 4 వ దినమున నస్థిసంచయనము నాచరింప వలెను. అస్థులను గంగోదకమునం దుంచవలెను. ఉపనయనముకాని వారిని దహనముచేసినను అస్థిసంచయనము చేయరాదు.

నపనవిధినిర్ణయః

29. వర్షీయస్యుద్గతే తూపరి వపననఖచ్ఛేదనం మాతకాంతే
మధ్యేవా కేచి దూచుః పిత్రు పరమగురు ష్వేవ వాహాది నిత్యం
అత్ర స్మార్త ... శుభార్తే భణిత మభణితం స్వప్వగృహ్యే ద్వితీత్వా
కృత్వా దానంచ దద్యా దశుభభయభిదే మాసురేభ్య శ్శుభార్థమ్॥

వ్యా :- అథ వపనాదివిధి మేకోనత్రింశేన వృత్తే నాహ వర్షీయసీతి - వర్షీయసి = వృద్ధే। ఉద్గతే = సంస్థితే సతి। తు = పునః। సూత కాంతే = దశ ... హని। ఉపరి వపనం నఖచ్ఛేదనంచ కనీయాంసః కుర్యా రితి శేషః। ఉపరివపనం = ఊర్ధ్వ కేశశ్మశ్రువపనం॥ వాక్యం-కేచి న్మధ్యే = ఆశౌచమధ్యే। ద్వితీయే తృతీయే పంచమే సప్తమే వాహ్ని కర్తవ్య మి త్యాహుః। తత్ర దేవలవచనం మూలం- శ్లో॥ దశమేహని సంప్రాప్తే స్నానం గ్రామా ద్బహి ర్భవేత్। తత్ర, త్యాజ్యాని వాసాంసి కేశ శ్మశ్రు నఖాని చేతి॥ తథా స్మృత్యంతర మపి॥ శ్లో॥ ద్వితీయేహని కర్తవ్యం క్షౌరకర్మ ప్రయత్నతః॥ తృతీయే పంచమే వాపి సప్తమే వా ప్రదానత ఇతి॥

వపనే నిమిత్తవిశేషే ణావశ్యకత్వ మాహ పిత్రు, పరమగురు ష్వేవవాహాదినిత్యం ఇతి పష్వేవ సంస్థితేషు। వాపః = వపనతదాదికర్మ। నిత్యం = ఆవశ్యకం; పుత్రాదీనాం నేతరత్రేతి భావః తదుక్తం యోగినా- శ్లో॥ గంగాయాం భాస్కరక్షేత్రే మాతాపిత్రో ర్గురో ర్మృతౌ। ఆధానకాలే సోమేచ వపనం సప్తసు స్మృత మితి॥

సూతకాంతే యత్కర్తవ్యం తదాహ అత్రేతి- అత్ర యత్, స్మార్తం, కర్తవ్యతయా భణితం = ఉక్తం। యన్నోక్తం। తత్సర్వం స్వగృహ్యాత్ విదిత్వా। అనంతరం। కృత్వా = అనుష్ఠాయ। పశ్చాత్। అశుభభయభిదే = అశుభనాశనార్థం। శుభప్రాప్తయే చ। భూసురేభ్యః = విప్రేభ్యః। దానం దద్యాదిత్యేతత్ స్పష్టం॥

తా:— 29 వ వృత్తముచే వపనాదివిధిని చెప్పుచున్నాడు- పెద్దవాడు చనిపోయినవా రగుచుండగా 10 వ రోజున ఊర్ధ్వకేశశ్మశ్రు వపనమునున్నూ, నఖచ్ఛేదనమునున్నూ చిన్నవారు చేయించుకొనవలెను. కొందరు ఆశౌచమధ్యమున 2. 3. 5. 7 దినములయందు చేయవలెనని చెప్పిరి. పై రెంటికిని ప్రమాణములు దేవల, స్మృత్యంతరవాక్యములు క్రమముగా గలవు. తల్లి, తండ్రి, పరమగురువు వీరిమరణమునందు వపనము నిత్యము. ఇతరుల కవసరము లేదని మతాంతరము.

యోగివాక్యము క్రిందివిధమున గలవు:— గంగా తీరమున, భాస్కరక్షేత్రమున, తల్లి, తండ్రి, గురువు వీరల మృతియందును, ఆధానకాలము, యజ్ఞమునను సోమసమయములందును వపనము నిత్యము.

నోటు:— ప్రథమదినమునందే నిత్యకర్మ ప్రారంభించదలచినచో దహనానంతరమైనను సంచయనముచేయవచ్చునని పండితులు నుడివిరి.

సూతకాంతమందు చేయదగిన కృత్యమును చెప్పుచున్నాడు: ఈ విషయమై స్మార్తమునందేయేవిధముగా నాచరించుమని చెప్పబడినదో యావిధినిషేధముల నెఱింగి యావిధమున నాచరించి, యనంతర మశుభనాశనార్థమును, శుభప్రాప్తికొరకును బ్రాహ్మణులకు దానముల నాచరించవలెను.

## దహనానంతరం ప్రేతగృహప్రవేశ విధిః

30. దత్త్వా పిండం సపిండాః పరశవవహనస్వాపకాశ్చ ప్రజిత్వా
తద్వేశ్మద్వారిచాస్య ప్రశమితమనసో నింబపత్రం విదశ్య।
అథ మ్యాగ్న్యంబుదూర్వాంకురవరవృషభా నక్షతాన్గోమయంచ
స్పృష్ట్వా సిద్ధార్థతైలా న్యథ దృషదిపదం న్యస్య సర్వే విశేయుః॥

వ్యాః— అథశవందగ్ధ్వా ఆగతానాం ప్రేతగృహప్రవేశవిధిః త్రింశేన వృత్తేనాహ దత్త్వేతి - సపిండాః = పూర్వోక్తాః। తథా పరశవవహనస్వాపకాః అసపిండాశ్చ। సర్వే పిండం దత్త్వా కర్త్రా దత్తే పిండే। తద్వేశ్మ = తత్ప్రేతస్య సంబంధిగృహం। ప్రజిత్వా। అస్య వేశ్మనః ద్వారి। ప్రశమితమనసః = అపహృతచిత్తాః। నింబపత్రం। విదస్య = చర్విత్వా। పశ్చా దాచమ్య। అనంతర మగ్న్యంబుప్రభృతీన్ ప్రసిద్ధాన్ స్పృష్ట్వా। దృషది। పదం న్యస్య = దత్వా। గృహం ప్రవిశేయు రితి సంబంధః॥ తథాచస్మృతిః - ఇతి సంస్మృత్యాగచ్ఛేయుర్గృహం బాలపురస్సరాః॥ విదశ్య నింబపత్రాణి నియతా ద్వారివేశ్మనః॥ ఆచమ్యాగ్న్యాదిసలిలం గోమయం గౌరసర్షపాన్। ప్రవిశేయు స్సమాలభ్య కృత్వాశ్మని పదం శనై రితి.

ఇతి త్రింశచ్ఛ్లోకీభాష్యం సమాప్తమ్

తాత్పర్యము :- 30 వ వృత్తముచేత శవమును దహించి, తిరిగి వచ్చినవారికి ప్రేతగృహప్రవేశవిధిని చెప్పుచున్నారు- సపిండులును, పరశవమును వహించిన యసపిండులును, కర్తచేత పిండదానముచేయబడినపిమ్మట, కర్తతో ప్రేతగృహమునకు వెళ్లి, శాంతచిత్తులై, యింటి ద్వారమునందు వేపాకును కొఱికి యాచమించి యాపైన, అగ్ని, ఉదకము, దూర్వాంకురములు శ్రేష్ఠమైన వృషభము, అక్షతలు గోమ

యము. శైలము మున్నగు మంగళద్రవ్యములను ముట్టుకొని గాని. చూచిగాని. రాత్రియందు పదమునుంచి నెమ్మదిగా వందరును ఇంటిలో ప్రవేశించవలెను.

పై విధముననే స్మృతికూడ వచించుచున్నది.

ఇతి శ్రీ సూరివరపు వేంకట శివసోమయాజి సంగ్రథితే, ధర్మనిర్ణయచంద్రికానామక ధర్మశాస్త్రగ్రంథే ద్వితీయభాగే త్రింశచ్ఛ్లోకాత్మకస్య తద్భాష్యస్య చ వేంకట శివసోమయాజివిరచితా ఆంధ్రటీకా సమాప్తా

# లక్ష్మీపతి సోమయాజీయే

## మలమాసవిషయః

శ్లో॥ మలిమ్లుచే మాసి మృతస్య పుంస స్త్వబ్దోదకేతు ప్రథమాబ్దికం
స్యాత్। మధ్యేదమాసేపి మృతస్య తద్వ దంత్యేధికే ద్వాదశమాస ఏవ॥

శ్లో॥ మలమాసమృతానాంతు ద్వాదశాహే సపిండనం
ఆద్యమాసికమపి పున ర్నిజమాసే కర్తవ్యం॥

శ్లో॥ ఆవృత్తి శ్చాన్యమాసానాం ద్వాదశాహే సపిండనం
తథా సంవత్సరస్యేదాంద్యం। మలే త్వావృత్తి రిష్యతే॥

ప్రచేతాః

శ్లో॥ శ్రాద్ధే ఉపాసిచ సంప్రాప్తే అధిమాసో యదా భవేత్।
మాసద్వయేపి కుర్వీత శ్రాద్ధ మేవం న దూష్యతి॥

శాతాతపః--

మలమాసమృతనాంతు యచ్ఛ్రాద్ధం ప్రతివత్సరం
మలమాసేపి కర్తవ్యం నాన్యేషాంతు కదాచన॥

వ్యాసః:-

షష్టిభి ర్దివసైః మాసః కథితో బాదరాయణైః
ఉత్తరే దేవ కార్యాణి పితృకార్యాణి చోభయోః॥

శ్లో॥ మధ్యేధిమాసే సంప్రాప్తే కథ మూనాబ్దికం భవేత్
మాసమలే నైవ కుర్వీత మాదలేతు సమాచరేత్॥

మాసమలే 355 : మాదలే 385

జాబాలిః :-

శుద్ధమాసమృతానాంతు మృతమాసాధికో భవేత్
అన్యాని చోత్తరేకుర్యాత్ ప్రథమం త్వధికే చరేత్॥

వ్యాసః :-

మృతిర్యస్మిన్ మాసే స్యాత్తస్మిన్నేవాబ్దికం చరేత్।
తద్వాచే దధికే త్వాద్యం ద్వితీయాదీని తూత్తరే॥

సంగ్రహకారః :-

శుద్ధమాసమృతానాంతు మలినే ప్రథమాబ్దికం।
మలమాసమృతానాంతు మలే స్యాదాబ్దికాంతరం॥

వ్యాసః :-

ఆబ్దికం ప్రథమం యత్స్యాత్తత్కుర్వీత మలిమ్లుచే
త్రయోదశేతు సంప్రాప్తే కుర్వీత పునరాబ్దికమ్॥

శ్లో॥ ఊనాబ్దికాత్పరం కార్యమాబ్దికాత్పూర్వవాసరే
సంవత్సరవిమోకాఖ్యమితి శాతాతపో బ్రవీత్॥

తా;— అధికమాసమందు పోయినవానికి మామూలుగా 12 వ రోజున సాపిండ్యమయ్యేవరకుచేసి నిజమాసములో పోయిన తిథియందు పార్వణవిధిగా ఆద్యమాసికమును తిరిగిపెట్ట. దానికి 12 వ రోజున గాని, 27 వ రోజు మొదలు 3 రోజులలో గాని ఊనమాసికము పెట్టవలెను. కాని ఊనమాసికము అధికమాసములో 12 వ రోజున పెట్టరాదు.

అధికమాస మృతునకే ఆద్యమాసికమునకు ద్విరావృత్తి గాని. నిజమాసమృతునకు ద్విరావృత్తి లేదు. ద్వితీయాదిమాసికములకు నిజమాసమునుండి లెక్క చూచుకొనవలెను. పోయినరోజు శుద్ధమందై 12 రోజులలోపున నధికమాసము వచ్చినను మామూలు ప్రకారము ద్వాదశాహస్సునందు సాపిండ్యానంతర మూనమాసికము పెట్టవలెను. కాని, అప్పు డాద్యమాసికమునకు ద్విరావృత్తి లేదు.

అధికమాసములో నిజమాసముచివరరోజులలో చనిపోయినవానికి,

సపిండీకరణము చేయవలసివచ్చినప్పుడు కూడా పై విధముగానే ఆద్యా, ఊన మాసికములను నిజమాసములోనే పెట్టవలెను.

అధికమాసమృతున కామాసమే మరియొకప్పు డధికమైనయెడల వాని కధికమాసమందే ఆబ్దికమును పార్వణవిధిగా పెట్టవలెను. మరల నిజమాసములో పెట్టనక్కరలేదు. నిజమాసమృతున కధికమాసములో సంకల్పవిధిగా బెట్టి నిజమాసములో పార్వణవిధిగా నాచరించవలెను.

అధికమాసములో పెట్టు మాసికమునను 'మలమాస ప్రయుక్త చతుర్థమాసిక' మని చెప్పవలెను. తవగా అధికమాసమాసికము లెక్కకు రాదు. నిజమాసములో పెట్టదగిన మాసికసంఖ్యయే యగును. కాన దానిని 'మలమాసప్రయుక్త చతుర్థమాసానుమాసికాఖ్యాన్నశ్రాద్ధ' మ్మని ఆవృత్తి చేసి చెప్పవలెను. మరల నిజమాసములో 'నిజమాసప్రయుక్త చతుర్థమాసానుమాసికాఖ్యాన్నశ్రాద్ధ' మ్మని చెప్పవలె నని భావము.

అధికమాసమందు చనిపోయినవానికి ప్రథమాబ్దికము 13వ మాసములో పెట్టవలెను. మధ్యలో నధికమాసము వచ్చినను 13 వ మాసములోనే పెట్టవలెను. అంతమం దధికమాసము వచ్చినచో 12 వ మాసమగు నా యధికమాసములోనే ప్రథమాబ్దికము పెట్టవలెను. తిరిగి నిజమాసములో పెట్టనక్కరలేదు. ద్వితీయాద్యాబ్దికములు శుద్ధమాసములోనే పెట్టవలెను. అధికమాసములో పోయినవాని కధికమాసములో నాబ్దికము యథావిధిగా పెట్టవలెను. నిజమాసములో సంకల్పవిధిగా నాచరించవలెను.

ఉదా:— వైశాఖమాసములో పోయినవానికి ఆ తర్వాత సంవత్సర వైశాఖ మధికమైనయెడల ఆ యధికమాసములోనే మృతతిథి యందు ప్రథమాబ్దికము యథావిధిగా పెట్టవలెను. తిరిగి నిజమాసములో ప్రథమాబ్దికము పెట్టనక్కరలేదు. ద్వితీయాద్యాబ్దికము లధికనిజమాసము

లలో పెట్టుచూ, నిజమాసములో యథావిధిగా పెట్టవలెను.
మాసము మొదలు ప్రథమాబ్దికములోపున వచ్చిన యధికమాసము ప్రథ మాబ్దికవిషయములో లెక్కచూడరాదు. పోయిన

## అధికమాసే త్రైపక్షికాది విచారః

మృతమాసమునకు ద్వితీయమాస మధికమైనయెడల ఆ యధిక మాసమందే త్రైపక్షికమును, ఆరవమాస మధికమైన నాయధికమాసమందే ఊనషాణ్మాసికమును, పన్నెండవమాస మధికమైనయెడల నాయధికమాస మందే ఊనాబ్దికమును జరిగించవలెను. కాని ఆయా నిజమాసముల యందు జరిగించరాదు. మధ్యమాసము లధికములైతే ఆమాసముల లెక్కపెట్ట నక్కరలేదు. ఊనాబ్దికమును 355 వ రోజున పెట్టరాదు. 385 వ రోజుననే పెట్టవలెను. అనగా 13 వ మాసములో ఊనాబ్దిక, విమోక, ప్రథమాబ్దికములు వరుసగా పెట్టవలెను. ద్వాదశమాస మధిక మైనయెడల నాయధికమాసమందు ఊనాబ్దికము, సంవత్సరవిమోకము ప్రథమాబ్దికము జరిగించవలెను. నిజమాసములో నక్కరలేదు.

## సంవత్సరవిమోకే శూన్యతిథి ప్రాప్తే

ప్రథమాబ్దికమునకు పూర్వపురోజున శూన్యతిథియైనచో సంవత్సరవిమోకమును తత్పూర్వతిథియందాచరించవలెను.

ఆరోజుకు జాతమృతాశౌచములు వచ్చినయెడల, వానిశుద్ధిదిన మందే – మొదట సంవత్సరవిమోకము, పృథక్పాకముచేత తర్వాత ప్రథమాబ్దికమును ఆచరించవలెను.

ఆబ్దికతిథియు. పూర్వతిథియు కలిసి యొకరోజుననే తిథిద్వయము మైనను పృథక్పాకముచేత ముందు సంవత్సరవిమోకమును, తర్వాత ప్రథమాబ్దికమును పెట్టవలెను.

శుద్ధినాడు శూన్యతిథియైనచో నాడో ఉపవసించి మరునా డాచ
రించవలెను. ఊనత్రయములను, ద్వితీయమాసికమును, షాణ్మాసిక
మును ఆశౌచమునోపడినను శుద్ధినాడు పెట్టవలెను. ఎందు కనగా-'ఊనాని
స్వస్వకాలేషు ప్రమాదా దకృతాని చేత్'. ఊనములను ప్రమాదమువల్ల
చేయనిచో మరల సపిండీకరణముచేయవలెనని శాస్త్రమున్నది గాన.

ఊనాబ్దికము ఆశౌచమునోపడినచో నాచరించరాదు. ఎందుకనగా-
ఒక ప్రేతనుగూర్చి ఒక్కనాడు మూడు శ్రాద్ధముల నాచరించరాదు గాన
ఊనాబ్దికమును వదలి సంవత్సరవిమోక ప్రథమాబ్దికములను శుద్ధినా
డాచరించవలెను. ఇది శిష్టాచారము.

శ్లో॥ సంవత్సరవిమోకాఖ్య మకృత్వా ప్రథమాబ్దికమ్।
యది కుర్వీత మూఢాత్మా కృతం ప్రాక్కర్మ నిష్ఫలమ్॥

తా:— సంవత్సరవిమోకము నాచరించకనే ప్రథమాబ్దికమును
పెట్టినచో వెనుకచేసినకర్మయంతయు నిష్ఫలమగును గాన తప్పక సంవ
త్సరవిమోక మాచరించవలెను.

# శాస్త్రమును దేశాచారమును అనుసరించిన ఆశౌచసంగ్రహము

జాతాశౌచ మన్నికులములవారికిని పదిదినములే!

మృతాశౌచము బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు క్రమముగా 10, 12, 15, 30 దినములు అవలంబించవలెను. సచ్ఛూద్రులకు 15 దినములు.

మొదటి 4 మాసములలో గర్భనిర్గమమైనచో స్రావమని పేరు. 3వ మాసము వెళ్ళలోపల స్రావమైనచో తల్లికి 3రోజులు జాతాశౌచము. 4 వ మాసమున స్రావమైనచో తల్లికి 4 రోజులు జాతాశౌచము. 4 వ మాసమున కఠినస్రావమైనచో తండ్రికి 3 రోజులు జాతాశౌచము. మొదటి నాలుగు మాసములలో స్రావమైనచో తండ్రికి స్నానమాత్రమే. 4 వ మాసములో నేవిధమైన స్రావమైనను జ్ఞాతులకు స్నానమాత్రమే. మొదటి మూడు మాసములలో స్నాన మక్కరలేదు.

5, 6 మాసములలో పాత మనిపేరు. 5 వ మాసములో 5 రోజులును, 6 వ మాసములో 6 రోజులును తల్లికి జాతాశౌచము కలదు, తండ్రి మొదలగు సపిండులకు 3 రోజులు జాతాశౌచము స్రావాశౌచము స్నానమాత్రముచే నివృత్తియగును. గ్రామాంతరమున గర్భపాతమైనచో తండ్రి మొదలగుసపిండుల కొక్కదిన మాశౌచము. 7 వ మాసము మొదలు పూర్ణప్రసవాశౌచము జ్ఞాతులందరకును గలదు.

జాతమున కతిస్రావాశౌచము లేదు.

పదిరోజులపైన విన్నను తండ్రి స్నానము చేయవలెను. శిశువు ప్రాణముతో జన్మించి, నాభిచ్ఛేదనకు పూర్వము మరణించెనేని తల్లికి పదిదినములు జాతాశౌచము. తండ్రికి సోదరులకు మూడుదినములు జాతాశౌచము మృతాశౌచము స్నానమాత్రముననే శుద్ధి

మృతప్రసవమైనను, నాభిచ్ఛేదనానంతరము శిశువు మరణించినను తండ్రికిని, సోదరులకును, జ్ఞాతులకును సంపూర్ణజాతాశౌచము. మృతాశౌచము స్నానమాత్రమునకే శుద్ధి యగును. తల్లికి దశరాత్ర మృతాశౌచము.

పదిదినములలోపల శిశువు మరణించినయెడల జ్ఞాతులకు, తల్లి, తండ్రి, సోదరులకు జాతాశౌచము జననాదిశేషముతో శుద్ధి. మృతాశౌచము స్నానమాత్రము.

మాతామహునింట దౌహిత్రుడు పుట్టిన మాతామహీ మాతామహులకు త్రిరాత్ర జాతాశౌచము. మేనమామలింట్ల మేనల్లుడు పుట్టిన మేనమామకు ఏకరోజు. కన్యకపుట్టిన నాశౌచములేదు. పుట్టుట వీరింట కానప్పుడు వీరికే యాశౌచము లేదు.

కొన్నియెడల ప్రథమ దౌహిత్రునికిమాత్రమే జాతముపట్టుట ఆచరణలో కలదు. మేనమామల కాచరణలో లేదు.

10 వ రోజు మొదలు 8 సం॥ల వెళ్ళులోపల బాలుడు మరణించినచో జ్ఞాతులకు స్నానముతో సరి. తల్లిదండ్రులకు 3 రోజులాశౌచము. సోదర సోదరీలకు 1 రోజు. ఇట్టివానికి జననము!

8 సం॥లు దాటి ఉపనయనము కాకనే మృతినందినచో దహనము. కర్మ శాస్త్రమందు చెప్పబడెను. జ్ఞాతులకు 3 రోజులు. తల్లిదండ్రులకు 10 రోజులు ఆశౌచము పట్టుట మనదేశమున నాచరణ గలదు. గౌతమీతీరమున ప్రత్యక్షోపనయనమునే ముఖ్యముగా నెంచెదరు ఉపనయనానంతరము సంపూర్ణాశౌచము.

శూద్రునికి ఉపనయనస్థానమందు వివాహము.

3 సం॥ల యనంతరము వివాహపర్యంతము. లేనిచో 16 సం॥ల పర్యంతము మరణమున త్రిరాత్రాశౌచము.

అనుపనీతమరణమునం దతిక్రాంతాశౌచము లేదు స్నానము చేయవలెను. ఔరసునిమరణమున తల్లిదండ్రులు వత్సరాంతమునందైనను త్రిరాత్రాశౌచము పట్టవలెను.

## కన్యాశౌచము

10 వ రోజు మొదలు వివాహపర్యంతము తల్లిదండ్రులకు 3 దినములు. జ్ఞాతులకు స్నానములో సరి. కన్యక వివాహము కాకపూర్వము రజస్వలయైనపిమ్మట మరణించినచో, జ్ఞాతులకు దశాహాశౌచము కలదు, దహనము, కర్మచేయవలెను. తల్లిదండ్రులు, సోదర సోదరీలకును దశాహమును జ్ఞాతులకు త్రిరాత్రమును ఆచరింపఁగలదు. వివాహానంతరము కన్యక పితృగృహమున మరణించినచో తల్లిదండ్రులకు, సపత్నీమాతకు, సపత్నీసోదరునికి, సహోదరులకును త్రిరాత్రాశౌచము కలదు. ఆ యింటియందలి పినతండ్రి మున్నగువారల కేకరాత్రము; గ్రామాంతరమందు మరణించినచో తల్లిదండ్రులకు పక్షిణియని కొందరిమతము.

వివాహితురాలైన కన్యయొక్క మరణవార్తను 10 రోజులలోపల నెప్పుడు విన్నను, తల్లిదండ్రులు విన్నదినగాయతు 3 రోజులాశౌచము పట్టవలెను దశాహానంతర మెంతకాలమునకు విన్నను పక్షిణి పట్టవలెను,

ఔరసపుత్రునికి దేశాంతరమందైనను, కాలాంతరమందైనను దశాహాశౌచమే.

దత్తునికి జనకతల్లిదండ్రులమృతియందు త్రిరాత్రము! సగోత్రుడు, సపిండుడునైన దత్తునికి పదిదినములు. జనకతల్లిదండ్రుల ఉత్తరక్రియల నాచరించినచో కర్మాంగముగ దశాహాశౌచము.

సపత్నీ మాతృ మరణమునందు - పదిరోజులలోపల విన్నచో వివాహితురాలైన కన్యకకు త్రిరాత్రము. వివాహానంతరము పక్షిణి. పుత్రునికి వివాహానంతరము దెప్పుడు విన్నను పక్షిణియే.

వివాహితుడైన సోదరుని మరణమునందు - సోదరియొక్క గృహమందుగాని, సన్నిధియందుగాని మరణించినచో త్రిరాత్రము; అసన్నిధానమున పక్షిణి.

అనుపనీత భ్రాతృ మరణమునందు- స్నానమాత్రమే.

పురుషులు ఉపనయనము లోపునను, స్త్రీలు వివాహము లోపునను చనిపోతే ఆత్మబంధువులకు పక్షిణి లేదు.

పక్షిణి యనగా ఒక రాత్రి, రెండు పగళ్ళుగాని; ఒక పగలు రెండు రాత్రులుగాని.

ఈ పక్షిణి మృతక్షణములనుండి 90 గడియల కాలములో వింటేనే పట్టుట కృష్ణాతీరమునందాచారము గలదు. పక్షిణికాల మతిక్రమించినను పదిరోజులలోపల విన్నయెడల అనగా పగలు వింటే ఆ పగలు లేక రాత్రి వింటే ఆ రాత్రి యుండి స్నానము చేయవలెనని శాస్త్రము చెప్పుచున్నది. 10 రోజులలోపల నెప్పుడు విన్నను విన్నదిలగాయతు 90 ఘడియలు పట్టుట గౌతమీతీరమున నాచరణ గలదు.

ఈ పక్షిణి పట్టవలసినవారు జ్ఞాతులు కానివారు(ఆత్మబంధువుల), యోని సంబంధము 3 పురుషులవరకు. వీరు సన్నిధియందు 3 రోజులును, అసన్నిధియందు 90 ఘడియలును పట్టవలెను.

వానప్రస్థుడు, యతి, సంయమి మరణించినచో స్నానముతో శుద్ధి. ఇట్టియశుసంకోచము కలియుగమున పనికిరాదని శాస్త్రమున్నది. త్రిరాత్రజ్ఞాతులకు కర్తృ క్రాంతాశౌచము లేదు. స్నానముచేతనే శుద్ధియగును.

దశరాత్రజ్ఞాతులకు దశరాత్రానంతరము 3 మాసములోపల 3 రోజులు: అది మొదలు 6 మాసములోపల పక్షిణి: అటుపిమ్మట 9 మాసములు వఱకు ఒకరోజు: అటుపిమ్మట స్నానముతో శుద్ధి.

ఇరువది మూ నుడదూరమునగాని. భాషాభేదముగాని, మహానది మహాపర్వతము వ్యవధానముగల దేశమునందుగాని 10 దినముల యనంతరము మరణవార్తవిన్నచో నతిక్రాంతాశౌచము పట్టవక్కర లేదు. స్నానముతో సరియగును.

తల్లిదండ్రులకు ఎంతకాలమునకైనను. దేశాంతరమందైనను దశరాత్రము పట్టవలసినదే! అట్లనే సపత్నీ మాతకు 3 రోజులు.

వివాహితురాలైన కన్యక మరణించినచో మాతాపితరులు, సోదర సోదరీలు వీరలకు సన్నిధియందు త్రిరాత్రము. అసన్నిధియందు పక్షిణి.

మాతామహుడు. మాతామహి. మేనమామ, దౌహిత్రుడు, పిన తల్లి, పెదతల్లులు వీరలమరణమునందు సన్నిధియందు త్రిరాత్రము; అసన్నిధానమున పక్షిణి. వివాహితురాలైన సోదరీ సోదరులకు పరస్పరము సన్నిధియందు త్రిరాత్రము; అసన్నిధిని పక్షిణి

తనమేనత్త. మేనత్తసంతతి. పినతల్లి. పెదతల్లులు. వారిసంతతి. మేనమామ. మేనమామసంతతి అను ఆత్మబంధువులమరణమునందు తనకును.తనమరణమునం దాత్మబంధువులకును సన్నిధియందు త్రిరాత్రము అసన్నిధిని పక్షిణి పట్టవలెను.

మేనత్తభర్త, పినతల్లి పెదతల్లుల భర్తలు. మేనమామభార్య వీరల మరణమందు, దేవదత్తునికి స్నానముతో సరి. దేవదత్తుని మరణమునందు పైవారికి గూడ స్నానమే.

వివాహమైన స్త్రీకి సోదర సోదరీలు మేనత్త మేనమామలు వీరలమరణమున సన్నిధియందు త్రిరాత్రము; అసన్నిధానమున పక్షిణి వివాహమైన స్త్రీమరణమందు పైవారికిగూడ నంతియే.

వివాహామైన స్త్రీకి సోదర, సోదరీల సంతతి, మేనత్త మేనమామల సంతతి వీరలమరణమందున్నూ పరస్పరము సన్నిధియందు పక్షిణి: అసన్నిధానమున స్నానమాత్రం.

అత్తమామలకు- భార్యగాని, సంతానముగాని జీవించియున్నపుడు సన్నిధియందు త్రిరాత్రము, అసన్నిధానమున పక్షిణి. భార్యగాని పిల్లలుగాని లేనపుడు సమీపమందైనను ఒకదిన మాశౌచమే!

అల్లునిమరణమునందు అత్తమామలకును పై విధముననే!

భార్య తోబుట్టువు (శ్యాలకుడు), చెల్లెలిమగడు (భావుకుడు) వీరలమరణమున సన్నిధియందు త్రిరాత్రము; అసన్నిధానమున పక్షిణి. భార్య మరణించినపిమ్మట శ్యాలకునికి సన్నిధియందు పక్షిణి: అసన్నిధానమున స్నానమాత్రము, సోదరిమరణించినపిమ్మట భావుకునికిగూడ పై విధముననే!

భర్త మరణవార్త భార్య, భార్యామరణవార్త భర్త ఎంతకాలమున కెవ్వట విన్నను దశరాత్రాశౌచము పట్టవలసినదే!

ముఖ్యకర్త దశాహానంతరము వచ్చి, తిరిగి దాహాదిక్రియలను నిర్వర్తించినచో జ్ఞాతు లదివరకే ఆశౌచమును పట్టి యుదకదానము నిచ్చినచో తిరిగి యాశౌచము పట్టనక్కరలేదు. ఆశౌచముపట్టనిచో 10 రోజులు పట్టవలెను. ఆశౌచముపట్టి యుదకదానము నీయనిచో తిరిగి, దాహాది 3 రోజు లాశౌచము పట్టవలెను.

యజ్వకు దశాహానంతరము పునర్దాహము జరిగినచో దశాహాశౌచము పట్టవలెను. దశాహమధ్యమందైతే అక్కరలేదు.

భావమరదికుమారునిమరణమందు :- భగినీభర్తకుస్నానమాత్రం.

భావమరదిభార్యమరణమందు :- స్నానమాత్రం. (ఏకాహామని కొందరు).

భార్యాసోదరీలమరణమందు :- స్నానమాత్రం.

పితృబంధుత్రయమునకును:- మాతృబంధుత్రయమునకును-సన్నిధి యందు త్రిరాత్రము; అసన్నిధియందు పక్షిణ్యని శాస్త్రము కన్పించు చున్నది. ఆచారము స్నానముతో సరియని పెద్దలు చెప్పిరి. తనమర ణమునందు పితృబంధుత్రయమునకును మాతృబంధుత్రయమునకును స్నానముతో సరి సంబంధము తగ్గిపోవుటచేత.

తోడిఇల్లుండ్రమరణమున :- పరస్పరము సన్నిధానాసన్నిధాన ములయందు స్నానమాత్రము.

స్త్రీలకు :- అక్కచెల్లెండ్రభర్తలు. పినతండ్రి పెదతండ్రుల భార్యలు, పినతల్లి, పెదతల్లులభర్తలు. మేనత్తభర్త. మేనమామభార్య వీరలమరణమున స్నానముతో సరి.

## యత్యాశౌచము

శ్లో॥ యతీనాం మరణే ప్రాప్తే। స్పృష్టిదోషో న విద్యతే।
ఆశౌచమిత్యాచక్షాణః। స్నానమాత్రం ధ్రువం॥

2. ఆశౌచమిత్యాత్మవత్కృతే। ఉపపాతకవాన్ భవేత్।
యతీనాం మరణే ప్రాప్తే నాశౌచం నోదకక్రియా॥

3. దహనాత్ మక్షయమేధస్య। ఫలం భవతి పుష్కలం।
జ్ఞాతిపుత్రకళత్రాణాం। పరివ్రాజ్మరణం యది॥

4 ఆశౌచం నాస్తి తేషాంవై। స్నానముప్యాచరేన్నతు।
భిక్షుః ప్రాణవినష్టస్తు। స్పృష్ట్వా ప్రాణిభిర్యది॥

5. తేషామప్యఘహాని స్యాత్। దాయుక్త్రుద్ధిశ్చజాయతే।
నమృత స్నానేపరస్కారః। నాస్థిసంచయనః॥

6. వైకోద్దిష్టం షోడశాన్నం । సాపిండ్యంచ న విద్యతే ।
నారాయణబలిం తత్ర । కుర్యా ద్దై ద్వాదశేహని ॥

7 తతశ్చ విష్ణుబుధ్యాతు । యతీన్ సంపూజయే ద్ద్విజః ।
అపుత్రో వా సపుత్రోవా । సిద్ధిం ప్రాప్తో యతి ర్యది ॥

8. నారాయణబలిం తస్య । కుర్యా దేకాదశేహని ।
షష్ఠిః కులా న్యతీ త్యాంతే । షష్ఠి రాగమికా న్యపి ॥

9. కులా న్యుద్ధరతే ప్రాజ్ఞః । సన్యస్త మితి యో వదేత్ ।
నిత్యపూజా మహాపూజా । నారాయణబలిః । పార్వణశ్రాద్ధం;
ఏతాని కర్తవ్యాని॥

తా:— యతులు మరణించినచో స్పృష్టిదోషము లేదు. ఆశౌచ బుద్ధిచే స్నానముగూడ చేయరాదు. యతుల కగ్నిసంస్కారము లేదు. ఏకోద్దిష్ట. షోడశ. సాపిండ్యములు లేవు. నిత్యపూజా. మహాపూజా. నారాయణబలి. పార్వణ శ్రాద్ధము వీని లాచరించవలెను. సన్యాసికి తల్లి చనిపోయినచో కర్మచేయనక్కరలేదు. 10 వ నాడు ధర్మోదకము మాత్ర మీయవలెను. జ్ఞాతులకాశౌచము గలదు. తండ్రి పోయినచో ధర్మోదకముగూడ నీయ నక్కరలేదు. ఆశౌచమున్నూ లేదు

## దంపత్యో రతిక్రాంతాశౌచనిర్ణయః

హారీతః :-

దూరస్థనిధనం భర్తుః దశాహా చ్ఛ్రూయతే యది॥
భార్యా కుర్యా దిదం పూర్ణం పత్న్యాశ్చ అపి పతి స్తథా॥
అపుత్రవిషయ మేతత్॥
దేశాంతరే భవే ద్భర్తా పత్నీయ మ్రియతే యది॥
ఆశౌచం త్రిదినం తత్ర సంస్కర్తా యస్య వైసుతః॥

తా - పుత్రులులేని భర్తయొక్క మరణవార్తను పదిరోజులు దాటినపిమ్మట భార్య వినినచో పూర్ణాశౌచముడు పట్టవలెను. భర్తకూడ నటులే పట్టవలెను. కుమారుడు మున్నచో, భార్యాభర్తలు పరస్పరము మరణవార్తను దశాహానంతరము విన్నచో 3 రోజులాశౌచము పట్టవలెను.

## ప్రేతభార్యా రజస్వలా

శ్లో॥ మృతే భర్తరి తస్యాః స్త్రీ ఆశౌచాంతే రజస్వలా।
శ్రాద్ధం తత్ర ప్రకుర్వీత, స్నాత్వా సూత్రం విముంచతి.
శ్లో॥ దశాహాభ్యంతరే చేన్నా ప్రేతభార్యా రజస్వలా।
తత్ర శ్రాద్ధాదికం కార్యం స్నాత్వా సూత్రం విసర్జయేత్॥

తా:- దశాహమధ్యమున ప్రేతభార్య రజస్వలయైనచో శ్రాద్ధాదులు పూర్తిగా నాచరించవలసినదే. స్నానమైనపిమ్మట సూత్రవిసర్జనము చేయవలెను.

## కర్తృభార్యా రజస్వలా

శ్లో॥ ఏకాదశేహ్ని సంప్రాప్తే కర్తృభార్యా రజస్వలా।
ఆద్యశ్రాద్ధం ప్రకుర్వీత ఊనాద్యాది విసర్జయేత్।
స్మృతిముక్తాఫలే - గృహ్యాపరిశిష్టే:
శ్లో॥ ఋతుమత్యపి దారేషు భార్యాగ్నిస్తు భవేద్యది।
సపిండీకరణం శ్రాద్ధం కుర్యాదేవావిచారయన్।
శ్లో॥ సపిండీకరణే ప్రాప్తే భార్యా యది రజస్వలా।
సపిండీకరణం నస్యాదగ్నా వనుదితే సతి॥

తా :- 11వ రోజున కర్తభార్య రజస్వలయినచో ఆద్య, వసు, రుద్ర, వృషోత్సర్జనములను చేసి, ఊనాదిపంచదశశ్రాద్ధములను అపు చేయవలెను. భార్యాగ్ని యున్నచో, భార్య రజస్వలయినను సపిండీ

కరణము నాచరించవలసినదే. సపిండీకరణకాలమునకు కర్తభార్య రజస్వలయినచో. భార్యాగ్నిలేనియెడల సపిండీకరణము నాపవలసినదే.

శ్లో॥ శ్రాద్ధకర్తుర్యదా భార్యా ఆశౌచాంతే రజస్వలా।
శ్రాద్ధశేషం ప్రకుర్వీత వర్జయిత్వా సపిండనమ్॥

ఇతి సంగ్రహకారవచనాత్ శ్రాద్ధశేషశబ్దేన ఏకాదశేహ్ని నవశ్రాద్ధవృషోత్సర్జన. స్వతంత్రాద్యత్రయాని కుర్యాత్. సపిండనార్థాపకృష్ట ఊనాదిపంచదశశ్రాద్ధాని వర్జయేత్॥ యదా ద్వాదశాహే స్నానదివసః తదా తస్యాః పూర్వవచ్ఛుద్ధిః॥ ఆద్యాదిషోడశశ్రాద్ధాని ఏకాదశేహన్యేవ కృత్వా ద్వాదశేహని సపిండీకరణం కుర్యాత్॥

తా:- 12 వ రోజున స్నానమైనచో 11 వ రోజుననే షోడశము వరకు చేసి 12 వ రోజున సపిండీకరణ మాచరించవలెను.

యల్లాజీయే 139 పుటే విశేషో ద్రష్టవ్యః

## శిష్టవాక్యములు

కర్మచేయుచుండగా కర్తభార్య రజస్వలగాని. ప్రసవముగాని అయినచో 11 వ నాడు నవశ్రాద్ధ వృషోత్సర్జన స్వతంత్ర ఆద్యత్రయములను చేసి ఆపవలెను. శుద్ధినాడు ఊనాదిపంచదశశ్రాద్ధములను చేసి, పృథక్పాకముచేత సపిండీకరణము నాచరించవలెను. సపిండీకరణమును మరునాడైనను చేసి, మాసికమును పెట్టవచ్చును.

ప్రేతభార్య కర్తయైయుండి రజస్వలగాని. ప్రసవముగాని అయినచో పైవిధముననే ఆచరించవలెను. కర్తకానిచో రజస్వలయినను ఆపనక్కరలేదు. ప్రసవమైనచో జాతాశౌచము వచ్చును. కాన పైవిధముగా 11 వనాడు ఆద్యత్రయమువరకు చేసి శుద్ధినాడు ఊనాదిపంచదశకర్మలను, సపిండీకరణమును చేయవలెను.

కర్తభార్య రజస్వలయైన 4 వనాడు 12 వ దినమైతే, భార్య చేత, వర్లదంపు నున్నగు కష్టపుపని చేయించి, మరల స్నానమాచరింపజేసి, యామెవలన నగ్నిహోత్రమును గ్రహించి సపిండీకరణ మాచరించవలెను. కాని ఆపరాదు

ప్రేతభార్య రజస్వలయైన 4వ రోజున మృతతిధి యయినచో అబ్దికము పెట్టవచ్చును. 4 వరోజు గానిచో పెట్టరాదు. ప్రేతభార్య కర్తయయినప్పుడే యీనియమము.

## మాతాపిత్రో ర్దశాహమధ్యే ఆబ్దికాగమే

తండ్రిదశాహమధ్యమున తల్లి అబ్దికము వచ్చినచో 12 వ రోజున సపిండీకరణానంతరం జరుపవలెను. తల్లి దశాహమధ్యమున తండ్రియాబ్దికము వచ్చినచో 11 వ రోజున షోడశాత్పూర్వం పెట్టవలెను. సపిండీకరణం 12వ నాడే చేయవలెను. కారుణ్యాములకు 12 వ రోజున సపిండీకరణానంతరమే ఆచరించవలెను.

ఇది శిష్టాచారము.

శ్లో॥ మాతుర్దశాహమధ్యేతు పితుః ప్రత్యాబ్దికం యది।
రుద్రాహే షోడశా త్పూర్వం పితుశ్శ్రాద్ధం సమాచరేత్॥

తా:— తల్లి దశాహమధ్యమున తండ్రిప్రత్యాబ్దికము సంభవించిన 11 వ రోజున షోడశమునకు పూర్వము ప్రత్యాబ్దికము పెట్టి తర్వాత షోడశము జరుపవలెను.

శ్లో॥ పితుర్దశాహమధ్యేతు మాతుః ప్రత్యాబ్ధికం యది।
రుద్రాహే షోడశా దూర్ధ్వం మాతుశ్శ్రాద్ధం సమాచరేత్॥
షోడశాత్ = సపిండీకరణా దిత్యర్థః

తా:— తండ్రి దశాహమధ్యమున తల్లి యాబ్దికము వచ్చినచో 11 వ రోజున షోడశానంతరము చేయవలెనని శాస్త్రము. షోడశసపిండీ

కరణముల కంగాంగిభావము గాన సపిండీకరణముచే నావిదే ఆబ్దికము పెట్టవాడు. 11 వ రోజున సపిండీకరణము కలియుగమున నిషేధింపబడి నదిగాన 12వ రోజున సపిండీకరణానంతరము తల్లి మాబ్దికము పెట్టుట యాచరణలో నున్నదని పెద్దలు నుడివిరి.

# లక్ష్మీపతి సోమయాజీయములోని విషయములు

## వివాహే కన్యా రజస్వలా

వివాహములో సుముహూర్తము మొదలు శేషహోమముమధ్య వధు వెప్పుడు రజస్వలయినను మూడురోజులు వెలుపలనుంచి, స్నానమైనపిమ్మట మరియొకక్రొత్తచీర కట్టించి, యుంజానఅహుతులు రెండును చతుష్పాత్ర ప్రయోగపూర్వకముగా హోమముచేసి తక్కినకర్మ మామూలుగా పూర్తిచేయవలెను

## వివాహే వధూవరయో ర్మరణే

సుముహూర్తము మొదలు శేషహోమముమధ్య వధూవరులు చనిపోయినయెడల శేషహోమాంతకర్మ తత్క్షణమే ముగించి, కంకణ విసర్జనచేసి, ఔపాసనాగ్నిచేత దహనాదికర్మ లాచరించవలెను.

## వివాహమధ్యే మాతాపిత్రాదిమరణే

ఉపనయనములోగాని, వివాహములోగాని, యజ్ఞములోగాని తల్లిదండ్రులుగాని, మాతామహమాతామహులుగాని చనిపోయినచో వినినక్షణమందే శేషహోమాంతకర్మ ముగించి, కంకణమువిప్పివేసి, వెళ్ళి వారిదహనాదికర్మ యథావిధిగా జరిగించవలెను ఈవిషయములో పెద్దవాడు రెండవవాడు నను భేదము చూడనక్కరలేదు.

## విభక్తావిభక్తభేదన పిత్రోరాబ్దికనిర్ణయః

అవిభక్తులు వేరు వేరు గ్రామములలోగాని, వేరువేరు ఇండ్లలోగాని కాపురముచేసినయెడల వేరువేరుగా ఆబ్దికములు పెట్టుకున్నను అందరు కలిసినప్పుడు జ్యేష్ఠు డొక్కడే చేసిన చాలును.

విభక్తులైనతర్వాత ఆబ్దికములు కలిపిపెట్టినయెడల ఆబ్దికములు వ్యర్థమగును. కర్తలు పాపాత్ము లగుదురు కాబట్టి విభక్తులుఆబ్దికములు కలిపిపెట్టరాదు.

## జీవత్పితృకస్య శ్రాద్ధాంగతర్పణవిచారః

శ్లో॥ జీవమానః పితా యస్య మాతా యది విపద్యతే।
మాతు శ్శ్రాద్ధం సుతః కుర్యా త్తర్పణంతు పితా చరేత్॥

తా॥- తండ్రి జీవించియుండి తల్లిచనిపోయినచో తల్లియాబ్దికము కుమారు డాచరించవలెను. శ్రాద్ధాంగతిలతర్పణమును తండ్రి చేయవలెను. నిత్యతర్పణాధికారము జీవపితృనకు లేదు. జలముతో నైనను జీవపితృకుడు శ్రాద్ధాంగతర్పణము చేయవలెనని శ్రాద్ధమంజరిలో కలదు. కాని యాచరణ లేదు.

## జీవపితృకస్య దర్శాదిశ్రాద్ధనిషేధః

జీవపితృకుడు తాను కర్తయయి పెట్టవలసినవారి కాబ్దికములు, మాసికములుతప్ప తక్కిన మహాలయాది, శ్రాద్ధములు, గయాశ్రాద్ధాదికములు చేయరాదు. తల్లికితప్ప మిగతావారి కాచరించుట యీదేశములో ఆచరణలేదు.

## ఆబ్దికదినే అనాహితాగ్నే ర్నిత్యతర్పణకాలః

అనాహితాగ్నియయినయాపస్తంబుడుతల్లిదండ్రులయాబ్దికానంతర మందే నిత్యతర్పణ వైశ్వదేవ బ్రహ్మయజ్ఞాదికము చేయవలెను. కారు

ద్యాబ్దికములందు పూర్వమే నిత్యతర్పణాదికము చేసి తర్వాత ఆబ్దిక ములు పెట్టవలెను. దర్శ. పాత. సంక్రాంత్యాదులయందు శ్రాద్ధానంత రము నిత్యతర్పణము చేయవలెను.

## ఆబ్దికాదిదినే ఆహితాగ్నే ర్నిత్యతర్పణవైశ్వదేవాదికాలః

ఆపస్తంబులైన యాహితాగ్నులు తలిదండ్రులయాబ్దికములోఁజున సంగవకాలమందే నిత్యతర్పణము వైశ్వదేవము బ్రహ్మయజ్ఞము మొద లగు నిత్యకర్మలుచేసి తర్వాత ఆబ్దికాదులు జరిగించవలెను. వైశ్వదేవ మునకు, దేవతానివేదనకు వేరు పాకమునందలి యన్నము నుపయో గించవలెను.

## నిత్యతర్పణ క్రమః

మరీచిః :—

శ్లో॥ ఆదౌ పితా తథా మాతా। సాపత్నీ జననీ తథా
మాతామహాస్సపత్నీకా। ఆత్మపత్న్య స్త్వనంతరం॥
సుత భ్రాతృ పితృవ్యాశ్చ। మాతులాశ్చ సభార్యకాః।
దుహితా భగినీ చైవ। దౌహిత్రో భాగినేయకః॥
పితృష్వసా మాతృష్వసా। జామాతా భావుక స్స్నుషా।
శ్వశుర శ్శ్యాలక శ్చైవ। స్వామినో గురురిక్థినః
ఇత్యేతే పితృతీర్థేన। తర్పణీయా యథాక్రమమ్॥

## పితామహశ్రాద్ధః

పుత్రసంతానములేని పితామహుడు చనిపోయినయెడల వాని కర్మ దహనాదిప్రథమాబ్దికాంతము యథావిధిగా పౌత్రుడు చేయవలెను. తండ్రియాబ్దికములో పితామహునకుగూడ పిండమియ్యబడునుగాన ద్వితీ యాద్యాబ్దికములు పెట్టనక్కరలేదు.

తల్లియుండగా పుత్రులులేని పితామహి పోయినయెడల ఆమెకు దహనాదిప్రథమాబ్దికాంత మేగాక తల్లి బ్రతికియున్నంత కాలము ప్రత్యాబ్దికములు పెట్టుచుండవలెను. తర్వాత పెట్టినను, పెట్టకున్నను దోషము లేదు.

విశేషము:- ధర్మసింధులో 357 వ పుటలో ప్రపితామహునకు కుమారుడు, మనుమడు లేనియెడల, మునిమనుమడు పితామహశ్రాద్ధమువలె ప్రపితామహునకు దహనాదిప్రథమాబ్దికాంతము చేయవలెను.

## కర్తృనష్టశ్రాద్ధం

తల్లిదండ్రులకు మాతామహీ మాతామహులకు తప్ప, తక్కువ వారికి కర్తనష్టమైనచో ప్రత్యాబ్దికములు పెట్టనక్కరలేదు. అవిభక్తుడైన పెద్దన్నగారు పోయినయెడల వానితర్వాత వాడును, అతడుపోయిన యెడల వాని తర్వాతవాడును, అతడు పోయినయెడల వతని తర్వాతవాడును, ఇట్లే తక్కినవారును పెద్దన్నగారికి మాత్రము ఆబ్దికములు పెట్టవలెను. రెండవవాడుపోతే మూడవవాడు ఆబ్దికమువగైరాలు పెట్టవలెనుగాని, 3 వ వాడుపోతే, రెండవవానికి తక్కినవారు పెట్టనక్కరలేదు. విభక్తుడైన పెద్దన్నగారు పోతే భార్యయే కర్త యగును. ఇట్లే తక్కినవారికిని భార్యలే కర్తలు

## మృతాహోతిక్రమే

ప్రమాదముచేత ఆబ్దికము మరచిపోయినయెడల జ్ఞాపకమువచ్చిన రోజునగాని అమావాస్యలో బహుళఅష్టమి, ఏకాదశి, అమావాస్యలలో రోజునగాని పెట్టవలెను. పెట్టునపుడు వరిష ప్రాయశ్చిత్తము ఒకరోజునగాని పెట్టవలెను. జ్ఞాపకము వచ్చినరోజు ఉపవసించి కృచ్ఛ్రత్రయముకూడా చేయవలెను, జ్ఞాపకము వచ్చినరోజు మరునాడు పెట్టుట ఆచరణలో నున్నది.

## మృతాహో ద్యజ్ఞానే

ప్రవాసమందు మరణించినవాని మృతతిధి తెలియనియెడల బహుళఏకాదశి మృతతిథిగా నెంచి కర్మల నాచరించవలెను. తిధితెలిసి, మాసము తెలియనిచో ఆషాఢ, మాఘ మాసములలో నొకదానిని గ్రహించవలెను. తిథి, మాసముకూడా తెలియనిచో ప్రయాణమెవెళ్ళిన మాస తిధులనే గ్రహించవలెను. తిథితెలియనిచో, శుక్లైకాదశి కాని, బహుళ ఏకాదశిగాని, అమావాస్యగాని, మాసముతెలియనిచో మార్గశిర, మాఘ, భాద్రపద, ఆషాఢ మాసములలో నొకదానిని గ్రహించవలెననిపక్షాంతరము గలదు. ప్రమాణమైవెళ్ళినవానిజాడ తెలియనిచో 12 సం॥లు చూచి ప్రతికృతిదాహముచేసి ఆరోజే మరణదినముగా నెంచవలెను.

## పిత్రో ర్మృతసంవత్సరే మహాలయాది నిషేధః

తల్లిదండ్రులు పోయిన సంవత్సరమన్య దర్శ, మహాలయ, గయా శ్రాద్ధములు చేయరాదు. దేశకాలవైపరీత్యశంకచే 12 వ నాడు సాపిండ్యముచేసినను, సంవత్సరాంతమందుగాని పోయినవానికి దేవత్వము రాదు. కర్తకు సంవత్సరసూతకము పోదు. కనుక రెండవసంవత్సరములోగాని దర్శశ్రాద్ధాదుల నాచరించరాదు.

## పిత్రాదివార్షికదినే పితృవ్యా ద్యాబ్దికప్రాప్తౌ

తల్లిదండ్రుల నూబ్దికములోను, మరికొన్ని యాబ్దికములు తటస్థమైనచో కుమారుడు రెండుఆబ్దికములుపెట్టి మూడవది తనకుమారుని చేతగాని శిష్యునిచేతగాని పెట్టించవలెను. లేదా మరువాడు పెట్టవలెను. రెండాబ్దికములు పెట్టినపుడు రెండవఆబ్దికపు వంటలో తాను భుజింపవలెను. ఆయాబ్దికములు 'ఆదౌ పితా తథా మాతా' అనే శ్లోకపువరుసలో సంబంధసామీప్యమునుబట్టి పెట్టవలెను.

## రాత్రౌ ప్రత్యాబ్దికశ్రాద్ధం

చంద్రసూర్యగ్రహణములుగాని, దైవిక, రాజకీయోపద్రవములుగాని సంభవించినపుడు రాత్రియందైనను ప్రత్యాబ్దికముల నాచరించవచ్చును.

## విధవాకర్తృకశ్రాద్ధవిశేషాః

భర్తయొక్క ఆబ్దికము తాను పెట్టవలసివచ్చినప్పుడు, "శ్రాద్ధార్థం సంపాదితాః పదార్థాః శ్రాద్ధయోగ్యా ముఖ్యా భవంతు" అనే లోపున వాకిటవున్నయెడల ఆయాబ్దికము అయినవరోజున పెట్టవలెను. అది అయినతర్వాత వాకిటున్నయెడల మరియొక బ్రాహ్మణునిద్వారా పెట్టించవలెను.

తానే జరిగించినయెడల సంకల్పవిధిగా పెట్టవలెనుగాని, అర్ఘ్యము పిండదానము వగైరా చేయరాదు.

## గయావళీనాం భోక్తృత్వప్రాధాన్యం

శ్లో॥ అమానుషా గయా విప్రాః । బ్రహ్మణా యే ప్రకీర్తితాః ।
తేషు తుష్టేషు సంతుష్టాః । పితృభి స్సహ దేవతాః ।
బ్రాహ్మణా న్న పరీక్షేత। తీర్థే క్షేత్రనివాసినః ॥

గయలో గయావళీలను తప్పక అర్చించవలెను. ఏ క్షేత్రమందున్నవారి నా క్షేత్రమం దర్చించవలెను. వారిమంచిచెడ్డ లాలోచింపరాదు.

## జ్యేష్ఠభార్యాపుత్ర ఏవ కర్మాధికారీ

అనేకభార్యలుగలవాడు మృతినందినప్పుడు ద్వితీయాదిభార్యల కుమాళ్లు పెద్దవారున్నను, చిన్నవయస్సుకలవాడైనను పెద్దభార్యకుమారుడే తండ్రికి కర్మచేయవలెను. ఆభార్యలు పోయినప్పుడు వారివారికుమాళ్లే ఆ స్త్రీలకు కర్మచేయవలెను.

## ఔరస ఏవ కర్తా, న తు దత్తః

ధర్మసింధౌ - దత్తకసత్త్వే ప్యౌరసస్యైవ పిత్రోః పిండదానే ధికారః॥ ఔరసపుత్రాభావే దత్తక ఏ వాధికారీ॥

## అపుత్రజనకస్య దత్తక ఏవ శ్రాద్ధాధికారీ ధనాధికారీచ

దా నితరునకు దత్తుడైనను చనిపోవునప్పటికి జనకతండ్రికి సంతానములేనియెడల తానే వానికిని, వానిభార్యకును, దత్తతతల్లి దండ్రులు జీవించియున్నను దహనాదిసంస్కారములతో యథావిధిగా కర్మచేసి, మాసికాబ్దికాదులను జరిగించవలెను, జనకునిఆస్తి రానియెడల తా నాకర్మ చేయనక్కరలేదు, ఆస్తిసంక్రమించినచో కర్మచేయకతప్పదు,

## సాపత్న్యమాతుః కర్తృనిర్ణయః

అపరకృష్ణీయ పూర్వఖండే—

శ్లో॥ సాపత్న్యమాతృమరణే ఆర్ద్రిపస్త్రోపవాసినా।
కృత్వా సో దహనం పుత్రః పిత్రోస్తు జీవతో రపి॥
సాపత్న్యమాతుః కుర్వీత పైతృమేధికకర్మచ।
చ కారా త్ప్రత్యబ్దాదికం కుర్యా దిత్యర్థః॥

స్మృతికౌముద్యాం 178 పుటే - సపత్నీపుత్రః కర్మాధికారీతి లిఖితం:

శ్లో॥ అపుత్రాయాః పతి ర్దద్యా త్స్వపుత్రాయాస్తు న క్వచిత్।
న పుత్రస్య పితా దద్యా న్నానుజస్య తథాగ్రజ ఇతి॥

అపుత్రాయాః పతి ర్దద్యా దిత్యత్ర స్వపుత్ర, సపత్న సపత్నీ పుత్రా ద్యభావవిషయ ఇతి మంతవ్యం,

## జీవత్పితృకాధికారః

ఉపనయనమైనవానికి, కర్తృత్వము వచ్చేదు సోదరుడుకాని, కుమారుడుకాని. భార్యకాని, తండ్రిసోదరులుకాని, మాతామహీమాతా

మహాలుకాని, సంతానములేని సపత్నితల్లిగాని పోయినప్పుడు, తల్లిదండ్రులు జీవించియున్నను తాను వపనాదిసంస్కారములుచేసికొని యథావిధిగా సపిండాంతముచేసి, మాసికాబ్దికాదులు జరిగించవలెను. కర్తనుపనయనముకానియెడల వానిమీద కర్తవ్య ముంచి మరియొకరు చేయవలెనుగాని, ఉపనయనమైనయెడల స్వయముగానే చేయవలెను. జీవపితృకు డని సందేహించరాదు. పెద్దలందరు ననేకచోట్ల ఈప్రకారమే చేయుచున్నారు. స్వయముగా చేయనియెడల పాతిత్యముకూడ చెప్పబడినది.

నోటు:—— ఈగ్రంథములో చెప్పినవిధముగా, సపత్నీమాతకుగాని, మాతామహాదులకుగాని జీవపితృకుడు స్వయముగా కర్మచేయుట కృష్ణామండలమున నాచరణలో లేదు. ఉపనయనమైనను, కాకున్నను, వానిపై కర్తవ్యమువేసి తండ్రియే కర్మచేయుట ఆచరణలో నున్నది,

## అంతర్దశాహే మాతాపితృమరణయో స్సన్నిపాతే

వేంకటసోమయాజీయే 183 పుటే, వైద్యనాథదీక్షితయేచ.

గద్య——మాత ర్యగ్రే ప్రమీతాయాం తదాశౌచమధ్యే యది పితా ప్రమీయేత తదా పితృమరణ మారభ్య దశాహాత ఏవ ఉదకదానాదిప్రేత కృత్యం పితు ర్నిర్వర్త్య, పితృమరణా ద్యేకాదశదినే ఆద్యశ్రాద్ధం కుర్యాత్ । పిత్రాశౌచ మధ్యే మాతృమరణాద్వా ఏకాదశదినే మాతు రాద్యశ్రాద్ధ మశుద్ధోపి కుర్యాత్ ॥

శ్లో॥ ఆద్యశ్రాద్ధ మశుద్ధోపి। కుర్యా దేకాదశేహని,
కర్తు స్తాత్కాలికే శుద్ధిః । అశుద్ధః పునరేవ సః ॥

పిత ర్యగ్రే మృతేసతి తదాశౌచమధ్యే యది మాతా ప్రమీయేత ।తదా-

శ్లో॥ జనకస్య మృతే ర్మధ్యే । జననీ మరణం యది।
పిత్రాశౌచే సమాప్తే స్యా న్మాత్రాశౌచంతు పక్షిణీ ॥

పిత్రాశౌచాంత్యదిన ఏవ మాతురపి పిండోదకసమాప్తిస్మరణాత్। పిత్రాశౌచమధ్యే మాతురపి దశాహకృత్యం పరిసమాప్య । పితు రేకాదశ

దినే లద్యశ్రాద్ధం నిర్వర్త్య, పిత్రాశౌచాంతరమపి మాతుః పక్షిణ్యాశౌచ మనుష్ఠాయ, మాతృమరణా ద్యేకాదశదినే తస్యా అద్యశ్రాద్ధం కుర్యాత్॥

శ్లో॥ ఆశౌచాంతే తత స్సమ్య క్పిండదానం సమాప్యతే,
తత శ్శ్రాద్ధం ప్రదాతవ్యం సర్వవర్ణే ష్వయం విధిః॥
ఇతి మరీచిస్మరణాత్ ॥

వా॥ అథాశౌచాపగమే ఏకోద్దిష్టం ఇతి విష్ణుస్మరణాచ్చ। మాతుః పక్షిణ్యాశౌచానంతరదినే ఏకోద్దిష్టం కుర్యా దితిచే న్న। ఏకోద్దిష్టం యథోదితం ఇతి స్మరణాత్॥ తథా మాధవీయ కాలాదర్శటీకాదౌ। తత ఆశౌచానంతర మేకాదశేహ్ని బ్రాహ్మణఏకోద్దిష్టం కుర్యాత్ । ఇతి మరీచ్యాది వచనార్థోభిహితః ॥

శ్లో॥ ఏకాదశేహ్ని య చ్ఛ్రాద్ధం । త త్సామాన్య ముదాహృతం ।
చతుర్ణా మపి వర్ణానాం । సూతకంతు పృథక్ పృథక్॥

శ్లో॥ మృతేహానితు కర్తవ్యం । ప్రతిమాసంతు వత్సరం ।
ప్రతిసంవత్సరంచైవ । మాద్య మేకాదశేహని॥

అతః పితృమృతిదశాహమధ్యే మాతృమరణేపితుర్దశాహానంతరం పక్షిణ్యాశౌచ మనుష్ఠాయ మాతృమరణా ద్యేకాదశాహే మాతు రేకోద్దిష్ట మితి నిర్ణయః॥

శ్లో॥ మాతు ర్దశాహమధ్యేతు । పితా యస్య ప్రమీయతే ।
పైతృకంతు యథాకాలం । పితు స్సర్వం సమాపయేత్॥
తతో మాతు స్త్రిపక్షాదౌ । శేషం కర్మ సమాచరేత్॥

తథా పితృదశాహమధ్యే మాతృమృతౌ పితు స్సాపిండ్యాం నివర్తయేత్ । ద్వాదశాహే న కుర్యాత్ । కింతు త్రిపక్ష ఏవ । మాతు స్తు సాపిండ్యాం పక్షిణ్యాశౌచాపగమే ద్వాదశాహే కుర్యా దిత్యర్థః॥

శ్లో॥ ఏకాగ్రమరణే పిత్రో రన్య స్స్యాన్న్యదినే మృతౌ,
సపిండనం త్రిపక్షే స్యా దనుయాసమ్మృతిం వినా॥

వా:—— పిత్రో రేక స్యాగ్రమృతౌ, అన్య స్యాన్యదినే మృతౌ పూర్వమృతస్య పూర్వమృతాయావా సాపిండ్యం త్రిపక్షే కుర్యాత్, అనుయానమృతిం వినా = అనుమరణం వినేత్యర్థః॥

తా॥ తండ్రిమరణించినమరుచటిదినముగాక దశాహమధ్యయందు గాని దశాహదినమందుగాని తల్లి మరణించినను, ఈప్రకారమే తల్లి దశాహమధ్యయందు తండ్రిమరణించినను చేయవలసినవిధి యెట్లనిన—— తల్లిమరణించిన 3 వ రోజుమొదలు 10 వ రోజులోపున, తండ్రి మరణించినచో అదిమొదలు 10 రోజులవరకును ఉదకదానము మొదలగు ప్రేతకృత్యములను తండ్రికి జరిగించుచుండవలెను. మరిన్ని తండ్రి మరణదినము మొదలు ముందు తండ్రికిని, తరువాత తల్లికిని తల్లియొక్క 10వ రోజువరకును నిత్యకర్మలు పూర్తిచేయుచు ఆరోజుననే తల్లియొక్క దశాహమునుగూడ పూర్తిచేసి, మరుచటిదినమున తండ్రియొక్క నిత్య కర్మను జరిగించి, తరువాత తల్లియొక్క ఏకాహ్వానమువరకును జరిగించి, ఆకర్మను ఆపి, మిగిలిన తండ్రియొక్క కర్మను 10, 11, 12 రోజులు పూర్తిచేసి, తల్లియొక్క మృతదినము మొదలు మూడవపక్షప్రారంభమున శేషించిన షోడశసపిండనములు పూర్తిచేయవలెను.

ఇదేప్రకారము తండ్రి ముందుమరణించి తర్వాత తల్లి మరణించినచో తండ్రియొక్క దశాహదినమందు, తల్లియొక్క మిగిలిన నిత్యకర్మలను అపకర్షజేసి దశాహముకూడ పూర్తిచేసి 11వ రోజున ఏకాహ్వానము వరకును తండ్రికిమాత్రము జరిగించి, అటుపిమ్మట తల్లియొక్క పక్షిణ్యా శౌచమును గ్రహించి, తల్లియొక్క 11 వ రోజున షోడశమును, 12 వ రోజున సాపిండ్యమును పూర్తిచేయవలెను.

తండ్రికి మిగిలిన షోడశసపిండనములు మూడవపక్షప్రారంభమున జేయవలెను. తల్లిదండ్రులలో ముందు మృతినొందినవారికిమాత్రము

3 వ పక్షప్రారంభమునను, వెనుకమృతినొందినవారికి వారిద్వాదశాహము నను సాపిండ్యము జరుపవలెను.

## శిలాలక్షణ ప్రమాణములు

రక్తం శ్వేతం తు పాషాణం । వర్ణానా ముత్తమోత్తమమ్ ।
బహువర్ణం నీలవర్ణం । పాషాణంతు పరిత్యజేత్॥
పాషాణస్య ప్రమాణంతు। ఆర్ద్రామలకమాత్రకమ్।
న చాధికం నైవ హీనం । ప్రవదన్తి మనీషిణః॥

## శ్రాద్ధభోజనే అన్యోన్యోచ్ఛిష్టస్పర్శదోషః

శంఖః:— శ్రాద్ధపంక్తౌ తు భుంజానో। బ్రాహ్మణో బ్రాహ్మణం స్పృశేత్ । తదన్న మత్యజన్ భుక్త్వా । గాయత్ర్యష్టశతం జపేత్ ॥ ఉచ్ఛిష్టలేపసస్పర్శే । ప్రక్షాళ్యాన్యేన వారిణా । భోజనాంతే ద్విజః స్నాత్వా । గాయత్రీత్రిశతం జపత్॥ భవే దుచ్ఛిష్టసంస్పర్శో। భోక్తుర్వా భోజనస్యవా । అన్నం తదేవ భోక్తవ్యం । న త్యాజ్యం భాజనే స్థితమ్॥ పున రన్నం న భోక్తవ్యం । యది భుంజీత. కిల్బిషీ। తత శ్చైవ జపే ద్దేవీ । శత మష్టోత్తరాధికా॥ భుక్త్వా పీత్వాచ యత్పాత్రం । రిక్తం త్యజతి యో నరః । స నరః క్షుత్పిపాసార్తో। భవే జ్జన్మని జన్మని॥

## పిత్రో ర్మృతా హ్యైక్యే

వ:—తల్లిదండ్రు లొకరోజునపోయినను, ఒకరుపోయిన కొంత కాలమున కా తిథియందే రెండవవారు పోయినను, తిథిభేదమున్నను, జాతమృతాశౌచాదులచేత ఇద్దరియాబ్దికము లొకరోజుననే తటస్థించినను వేరువేరుగా వంటలుచేసి, ముందు తండ్రియాబ్దికముపెట్టి, తర్వాత తల్లి యాబ్దికము పెట్టవలెను. ఒకేరోజున కాని, కాలభేదముచేతగాని తల్లి ముందుపోయినను తండ్రికే ముందుపెట్టవలెను.

ఏకారణముచేత దంపతుల కేకచితిదహనము సంభవించినను సంచయనాంతముల కొకమంత్రముచేతనేదహనము చేయవలెను సాపిండ్యము

చేసి, నిత్యవిధిమొదలగు తక్కినకర్మ యావత్తు వేరువేరుగా చేయుటే యుక్తమని నాకు తోచినది. ఈవిషయమై శిష్టాచార మెక్కడను నాకు తటస్థము కాలేదు. సహగమనమునందు దహనమాత్రము కర్మయావత్తును, అబ్దికాదులును కలిపిపెట్టవలసినదేకాని, ఈయుగములో సహగమనములేనందున ఆయాచరణ మక్కరలేదు. ఒకరోజున దంపతులకు సహమరణము సంభవించినను అది సహగమనము కాదు.

## రజోమధ్యే పతిమరణే స్త్రీకర్తృకవిషయః

వ:—కర్తయగుభార్య బహిష్ఠయుండగా భర్తపోయినయెడల ప్రాయశ్చిత్తవిధానముగా మలాపకర్షణస్నానము, ప్రాజాపత్య, కృచ్ఛ్రత్రయప్రాయశ్చిత్తములు చేసి బ్రాహ్మణానుజ్ఞ నొంది బంధువునకు వరణ యిచ్చి సమంత్రకముగా దహనముమాత్రము చేయించి, పంచమదినమం దారంభించి, యథావిధిగా చేయవలెను. అట్లు మలాపకర్షణస్నానాదికము చేయలేనియెడల అమంత్రకముగా దహనముచేయించి రజస్వలాపంచమ దినమందు పునర్దహనముచేసి అస్థిసంస్కారాదులు యథావిధిగా చేయవలెను:

## బ్రహ్మచారిణః కపాలాగ్నినిర్ణయః

వ:—కుండపెంకు ఎఱ్ఱగా కాల్చి అది యిపతలకు తీయగానే మూదిగాని గడ్డిగాని దానిమీద నుంచి, ఆ యగ్నిని చెక్కనలిమొదలగు వానిచేత వృద్ధపరచి, ఆయగ్నిచేత బ్రహ్మచారిని దహనముచేయవలెను.

## విధవాదీనా ముత్తపనాగ్నినిర్ణయః

శ్లో॥ విధవాం విధురం కన్యాం దహే దుత్తపనాగ్నినా ॥

వ:—దర్భకట్ట వెలిగించి ఆజ్వాలనుండి మరియొకదర్భకట్ట వెలిగించి, ఆ జ్వాలను చెక్కనలిగించి దానినుండి మరియొకదర్భకట్ట వెలి

మొదలగువానిచే దృఢపరచి, ఆయగ్నిచేత విధవస్త్రీని, విధురుని ప్రాయమువచ్చినకన్యను దహనముచేయవలెను.

## త్రిరాత్రాశౌచినాం కర్మ

వ:—మూడురోజులే ఆశౌచముపట్టతగినజ్ఞాతికి, దశాహానంతరము కర్మచేయవలసివచ్చినయెడల మొదటిరోజునగాని, రెండవరోజునగాని సంచయనమును, మొదటిరోజున రెండు నవాహ్నికములను,రెండవరోజున రెండును, 3వ రోజున ఒకటియు చేసి, నాల్గవరోజున ఆరవ నవాహ్నికమును, షోడశమును, 5వ రోజున సాపిండ్యమును చేయవలెను.

దేశాంతరమందు పోయినవానిమరణము తెలిసి ఆయాశౌచానంతరమందు కర్మచేయుటకూడ 3 రోజులే కాబట్టి, ఆకర్మకూడ పైనచెప్పినట్లే చేసి,5 వ రోజుననే సాపిండ్యముచేయవలెను. ఏవిధమునే మూడురోజులు కర్మచేయవలసినను ఇదియేప్రకారము చేయవలెను.

## ప్రేతకర్మమధ్యే అన్యప్రేతకర్మప్రాప్తౌ జననాశౌచేవా

వ:— ప్రేతకర్మచేయువానికి దశాహములోపున జ్ఞాతిసంబంధమైన జననమరణాశౌచములు వచ్చినను, పూర్వాశౌచముతో శుద్ధియగును. గాన షోడశసాపిండ్యముల కభ్యంతరము లేదు. కాని కర్తకుగాని ప్రేతకుగాని సంతానముకలిగినయెడల, 11 వ రోజున అవ్యాత్రయము పరకుచేసి, ఆపి, శుద్ధినాడు ఊనాదిపంచదశకర్మలు, సపిండీకరణమున్నా ఆరోజుననే చేయవచ్చును. స్వతంత్రకముకానిచో దశాహానంతరమైనచో మిగతకర్మ నింకొకరు చేయవచ్చును. దశాహాత్పూర్వమైతే, దహనసంచయనములుతప్ప మిగతా కర్మయంతయు చేయవలెను. ఈదహనకర్తయే ఆపదిరోజులలోపున మరియొకప్రేతకు కర్తయై దహనముచేసినను పూర్వకర్మకు షోడశసాపిండ్యములు చేయవచ్చును. కాని, తల్లిదండ్రులు పోయినయెడల వారికర్మపూర్తిఅయితేగాని మొదటివానికి షోడశసాపిండ్యములు చేయకూడదు

## పితుర్దశాహమధ్యే పుత్రమరణే

వ:— తనపితామహునకు కర్మచేయుచున్న సోదరులులేనితండ్రి చనిపోయినయెడల తాను తనతండ్రికి దహనాద్యాద్యశ్రాద్ధపుప్రగణ వృషోత్సర్జనాంతము కర్మచేసి, తర్వాత తండ్రి కొంతచేసిన పితామహుని కర్మ తిరిగి మొదటినుండియు 3 రోజులలో చేసి, పితామహునికే ముందు షోడశసాపిండ్యములు చేసి, తర్వాత తండ్రికి షోడశసాపిండ్యములు చేయవలెను,

ఆకర్మచేయుచున్నతండ్రికి సోదరులున్నయెడల, వారే సాపిండ్యాదికము చేతురుకాబట్టి, తండ్రికి సాపిండ్యాంతము మామూలుగా చేయవలెను. పితామహునికికూడా ఇట్లే చూచుకోవలెను.

## దశాహమధ్యే తిలోదకాదివిఘ్నే

వ:— కర్మచేయుచుండగా పదిరోజులలోపున, నిత్యవిధిచేయుటకేకారణము చేతనైనను అభ్యంతరము వచ్చినయెడల దహనముతప్ప తక్కినకర్మ యావత్తు మొదటిరోజునుండి తిరిగి చేయవలెను.

## దశాహమధ్యే దర్శసంక్రాంతిపాతే సంచయనాది

వ:— తల్లిదండ్రులుగాని, సవతి తల్లిదండ్రులుగాని, మాతామహీమాతామహులుగాని చనిపోయిన 10 రోజులలోపున ఎప్పుడమావాస్యగాని సంక్రమణముగాని వచ్చినను, నిత్యకర్మ అపకర్షచేయకుండ 10 రోజులు మామూలుగా చేయవలెను. మీదుగాక తక్కినవారు పోయిన 10 రోజులలోపల ఎప్పుడమావాస్యగాని సంక్రమణముగాని వచ్చినను, ఆ దర్శసంక్రమణములయందే పదిరోజులతంత్రము అనగా కర్త 10 వ రోజువరకు చేయవలసిన పిండప్రదానాంతకర్మ పూర్తిచేయవలెను. 10 వ నాడు జ్ఞాతులు తిలోదకము తీయవచ్చును. చతుర్దశఘడియలలో పోయి

అమావాస్యనాడు దహనమైనను అప్పుడే దశాహమువరకు నిత్యకర్మ చేయవలెను.

నిత్యకర్మ దర్శాదియందు ముగించినను, పాషాణోత్థాపనము, ప్రభూతబలి మాత్రము దశాహమునాడే చేయవలెను.

## అమాయాం మరణే విశేషః

వ:— అమావాస్యనాడు చనిపోయినయెడల జ్ఞాతులు, తల్లిదండ్రులు వగైరాలందరికిగూడ పదిరోజులు మామూలుగానే ప్రతిరోజు తిలోదకపిండప్రదానములు చేయవలెను.

## సంవత్సరసూతకనిర్ణయః.

శ్లో॥ పిత్రో రబ్దమశౌచం స్యా న్మాతు ష్షాణ్మాస మేవచ ।
మాసత్రయంతు భార్యాయాః తదర్ధం భ్రాతృపుత్రయోః ॥
అన్యేషాంతు సపిండానాం మాస మేక ముదాహృతమ్ ॥

వ:— తల్లిదండ్రులుపోయినయెడల ప్రథమాబ్దికమువరకును సంవత్సరసూతక ముండును. సవతితల్లికి కర్మచేసినవాని కారుమాసములును, భార్యకు కర్మచేసినవానికి 3 మాసములును, కుమారునకును సోదరులకును కర్మచేసినవానికి ఒక నెలపదిహేనురోజులును, తక్కినసపిండులకు కర్మచేసినవాని కొకనెలయును అశౌచ ముండునుగాన, అమఖ్య గయాశ్రాద్ధాదులు, మహాలయమువగైరా చేయరాదు. తాను కర్మచేయుట అనగా సంతానములేనివారి కని యర్థము. ఇప్పుడు— ద్వాదశాహమున్సున సాంపిద్యము జరుగుచున్నది కావున మహాలయాదిసర్వకర్మలు చేయవచ్చునని కొందరు భ్రమపడుచున్నారు. కాని, శిష్టులు తల్లిదండ్రులుపోయినవారింటిలో మంచితీర్థమైనను పుచ్చుకొనుట లేదు కావున పైనచెప్పినకాలముల రీతిని అశౌచ మున్నదని గ్రహించవలెను. అశౌచమున్నవాడు మహాలయాదికర్మల కనర్హుడు కావున నష్టిశ్రాద్ధములును, తాను చేయవలసిన

వివాహోపనయనాదులు నాయాకాలములయనంతరమందే చేయుట శ్రేయస్కరము. మరియు సపిండీకరణమైనను అట్టివానికి యజ్ఞాదులలో ఆర్త్విజ్య మిచ్చుటలేదు కావున సపిండీకరణమైనను సంవత్సరసూతకముండుటచేత మహాలయగయాశ్రాద్ధాదులు, కన్యాదానాదికమును చేయగూడదు.

## షోడశశ్రాద్ధశేషాన్నభోజనవిషయః

వ:— పదకొండవరోజున కర్తకుకూడ పంచమహాయజ్ఞాధికారము గలదుకాని. తాను కర్మచేసేటిశౌచములోపడ్డ తల్లిదండ్రాదులయాబ్దికము 12వరోజుననే పెట్టవలెను. 11వరోజున పెట్టరాదు. ఆద్యశ్రాద్ధములో భుజించే భోక్తకు, ప్రేతయొక్క మంచము, పీట, పరుపు, తలగడ, ఉంగరములు, చెంబులు, కుర్చీలు మొదలగు వస్తువు లీయవలెను. తర్వాత రుద్రగణము, వృషోత్సర్జన, వసుగణశ్రాద్ధము, షోడశము చేయవలెను. 11వ రోజున ఆద్యైకోద్దిష్టమే కారణముచేతనైనను మానివేసినయెడల, తిరిగి దహనము మొదలుకొని కర్మయంతయు చేయవలెను. ఈరోజున షోడశానంతరము మరియొకశ్రాద్ధములేదుకనుక కర్త షోడశశ్రాద్ధశేషాన్నమే భుజింపవలెను.

## మృతస్య పిత్రాదౌ స్థితే వర్గత్రయనిర్ణయః

వ:— పితామహుడుండగా తండ్రిపోయినయెడల, మాసికాబ్దికాదులలో తండ్రిని రెండుమార్లును, ప్రపితామహుని ఒక్కమారును వర్గత్రయముగా చెప్పి, ఆప్రకారమే పిండప్రదానముచేయవలెను. సాపిండ్యములో కర్తయొక్క ప్రపితామహునకు రెండుపిండములును, ప్రప్రపితామహుని కాకపిండమును సంయోజనచేసి, కర్తయొక్క ప్రప్రపితామహునే అనగా ప్రేతయొక్క ప్రపితామహునే చతుర్థపురుషనివృత్తి చేయవలెను. పితామహి యుండగా తల్లిపోయినను ఇట్లే చూచుకోవలెను. పితామహుడుపోయిన తర్వాత క్రమసాపిండ్యము పునస్సపిండీకరణములో చెప్పినవిధముగా తిరిగిచేయవలెను.

## మృతస్య పిత్రాదౌ స్థితే సాపిండ్య నిర్ణయః

### (వ్యుత్క్రమ సాపిండ్యం)

పితామహుడు, ప్రపితామహుడును, బ్రతికియుండగా తండ్రి పోయినయెడల, మాసికాబ్దికాములలో తండ్రినే మూడుపర్యాయములును, వసురుద్రాదిత్యరూపములలో వర్గత్రయము చెప్పి, యీప్రకారమే పిండప్రదానము చేయవలెను. సాపిండ్యములో కర్తయొక్క ప్రప్రపితామహునితోనే మూడుపర్యాయములు పిండాదిసంయోజనచేసి, వానినే చతుర్థపురుషనివృత్తిని చేయవలెను. ఎప్పుడును, ప్రేతకు చతుర్థపురుషుడు లేపభాక్కు గాని సపిండుడు కాడు గావున, వానిని వర్గత్రయములో చేర్చకూడదు. పితామహీ, ప్రపితామహీ యుండగా తల్లిపోయినను ఇట్లే చూచుకోవలెను.

పితామహుడు, ప్రపితామహుడును పోయినతర్వాత పునస్సపిండీకరణములో చెప్పినవిధముగా క్రమసాపిండ్యము తిరిగి చేయవలెను. కర్తయొక్క పితామహ, ప్రపితామహ, ప్రప్రపితామహులు ముగ్గురు బాగున్నయెడల సాపిండ్యము చేయకూడదు. ఈకారణమునుబట్టియే ప్రేతయొక్క ప్రపితామహునితోనే సాపిండ్యముచేయకతప్ప దని స్పష్టమగుచున్నది.

## అథ శ్రవణనిషిద్ధకర్మాణి, శ్రాద్ధాంగతిలతర్పణవిషయంచ

శ్లో॥ ఊనశ్రాద్ధేషు సాపిండ్యే నిత్యశ్రాద్ధేనుమాసికే ।
సంవత్సరవిమోకేతు న జపే త్పితృసూక్తకమ్ ॥

స్మృత్యంతరే :

తీర్థశ్రాద్ధే గయాశ్రాద్ధే సాపిండ్యే చానుమాసికే ।
న కుర్యా దన్నసూక్తాని న కుర్యా త్తిలతర్పణమ్ ॥

[illegible] కుర్యా త్తిలతర్పణ మితి వచనాని శ్రాద్ధాంగతర్పణ నిషేధపరః॥

దర్శే తిలోదకం పూర్వం పశ్చా ద్దద్యా న్మహాలయే ।
ఆబ్దికే న పరః పూర్వం పరేహ్ని తిలోదకమ్ ॥

వ:—— ప్రేతశ్రాద్ధ సాపిండ్యశ్రాద్ధ ఊనశ్రాద్ధ నిత్యశ్రాద్ధాను మాసికశ్రాద్ధ సంవత్సరవిమోకశ్రాద్ధ తీర్థశ్రాద్ధ, గయాశ్రాద్ధ నాందీశ్రాద్ధ సపశ్రాద్ధానుశ్రాద్ధములయందు అన్నసూక్తాధశ్రవణములు చెప్పకూడదు.

శ్రాద్ధాంగతర్పణము కొన్నిశ్రాద్ధములయందు మరునాడు చేయ మని యున్నను, దేశకాలవైపరీత్యాదులచేదోషమునికుండ అందరికినిగూడ శ్రాద్ధానంతరమందే చేయవలెను. మరియు శ్రాద్ధాంగతర్పణము తీర్థ శ్రాద్ధమందును దర్శశ్రాద్ధమందును పూర్వమును, మహాలయశ్రాద్ధమందు శ్రాద్ధానంతరమును చేయవలెను.

శ్రాద్ధాంగతర్పణ మాబ్దికమే వర్గమునకు జరిగినదో యావర్గమునకు మాత్రమే చేయవలెనుగాని, నిత్యతర్పణమువలె అందరికి చేయరాదు.

## పునస్సాపిండ్యనిమిత్తాని

వ:—— సపిండీకరణములో భోక్త వమనము చేసికొనినను, పం దము పిల్లులు మొదలగునవి ముట్టుకొనినను పునస్సాపిండ్యము చేయ వలెను,

మరియు తల్లిదండ్రులు పోయేవర కుపనయనముగాని కుమారున కుపనయనమైనతర్వాత వచ్చే తల్లిదండ్రులయాబ్దికమునకు వెనుకటిరోజున ప్రేతశబ్దము, పిండార్ఘ్యసంయోజనము లేకుండ పునస్సపిండీకరణము- (దేవసపిండీకరణము) చేయవలెను,

మరియు తాతగాని, ముత్తాతగాని, యిద్దరుగాని బ్రతికియుండగా తండ్రిపోయినయెడల వ్యుత్క్రమసాపిండ్యము జరుగునుగాన, వారు పోయినతర్వాత వచ్చే తండ్రియాబ్దికమునకు పూర్వదినమున ప్రేతశబ్దము పిండార్ఘ్యసంయోజన లేకుండ పునస్సపిండీకరణము చేయవలెను.

## సాగ్నికపుత్ర ఏవ సపిండీకరణకర్తా

వ:— తల్లిదండ్రులు సాపిండ్యము చేయునపుడు పెద్దకుమారునకు భార్యలేనియెడల భార్యకలిగిన తరువాతివాడు ఔపాసనచేసికొని, ఔపాసనాగ్నియందు అగ్నౌకరణముమాత్రము చేయవలెను. తక్కిన కర్మయంతయును భార్యలేకయుపోనను పెద్దవాడే చేయవలెను.

## శుక్రవాసరే సపిండీకరణనిషేధః

వ:— 12 వ రోజు శుక్రవారమైనయెడల తల్లిదండ్రులసాపిండ్యము చేయవచ్చునుగాని, యితరుల కానాడు చేయరాదు. మాతామహమహీలకుకూడ చేయవచ్చును.

## షోడశానంతరం కర్తృ. ప్రేతభార్యా రజస్వలాదౌ

వ:— షోడశసాపిండ్యముల కనేకకాలము లుండుటచే షోడశ సాపిండ్యములకు సంకల్పముచేసినను 'శ్రాద్ధార్థం సంపాదితాః పదార్థాః— శ్రాద్ధయోగ్యా ముఖ్యా భవంతు' అని అన్నసంస్కారములోపున కర్త భార్యగాని, ప్రేతభార్యగాని వాకిటనున్నను, ఆశౌచమువచ్చినను, ఆ సంకల్పముచేసినశ్రాద్ధమును అద్యత్రయమువరకుచేసి, అపి, స్నానానంతరం 5వనాడు ఊనాదిపంచదశకర్మలును, సపిండీకరణమును, పవృథక్కారమున చేయవలెను, సపిండీకరణము మరునాడైనను చేయవచ్చును.

మరియు షోడశములో 'శ్వ స్సపిండీకరణం కర్తుం' అని సంకల్పముచేసినాము కాబట్టి షోడశానంతరం సాపిండ్యమునకు పూర్వము కర్తృ. ప్రేత భార్యలు వాకిటయున్నను ఆశౌచమువచ్చినను సాపిండ్యము చేయరాదు. కాలములేని ఆబ్దికాదులుకూడ మొదటసంకల్పముచేసినను పైన వ్రాసిన అన్నసంస్కారములోపల ఆశౌచమువచ్చిన ఆశౌచాంతమందు చేయవలెనని యుండగా, అనేకకాలములుగల సాపిండ్య మాపుటకు సందేహము లేదు.

## పిత్రోస్సపిండనే ప్రాశనవిధిః

వ:— తల్లిదండ్రులసాపిండ్యమురోజునే ఊనమాసికముకూడ పెట్టేయెడల, సాపిండ్యములో ప్రాశ్య అనేటప్పుడు ఆఘ్రాణము చేసి ఊనమాసికములోమాత్రము తప్పక ప్రాశనచేయవలెను. ఊనమాసికము మరియొకప్పుడు పెట్టేయెడల సాపిండ్యములోనే ప్రాశనముచేయవలెను. మాసిశ్రాద్ధవిధానముగా ఆబ్దికముపెట్టేవారే ప్రాశనచేయుచున్నారు. పార్వణవిధిగా పెట్టువారు ప్రాశనచేయుట లేదు.

## ద్వాదశాహే సపిండీకరణనిర్ణయః

వ:—ఏకాదశాహస్సున షోడశమును ద్వాదశాహస్సున సాపిండ్యమును కలియుగములో ముఖ్యముగా చేయవలెను. 13 వ రోజున కర్త బంధువులతోకూడి యభ్యంగస్నానము విధిగాచేయవలెను, ప్రేతకర్మారంభమందు ధరించిన వస్త్రములు సాపిండ్యమైనతర్వాత స్నానముచేసి యితరుల కిచ్చివేసి యితరవస్త్రములను ధరించి ఊనమాసికము పెట్టవలెను.

## త్రైపక్షికాది కాలాః

శ్లో॥ త్రిపక్షే ద్వాదశే పక్షే చతుర్వింశతిపక్షకే ।
ఊనత్రయం ప్రకుర్వీత ఆదిమధ్యాంత పంచకే ॥

వ:— ఊనమాసికము 12 వ రోజున పెట్టనియెడల 27 వ రోజు మొదలు 3 రోజులలో పెట్టవలెను,

త్రైపక్షికము 3 వ పక్షము మొదటియైదురోజులలోను, ఊనషాణ్మాసికము 12 వ పక్షమున మధ్యపంచకమునను, ఊనాబ్దికము 24 వ పక్షమున చివరపంచకమునను ఆచరించుట కృష్ణామండలమున నాచరణలో గలదు. 'అంత్యమధ్యాదిపంచకే' అనునది యీప్రాంతమున నాచరణలో లేదు.

## అనేకసపిండపునర్దహనే

వ:—సమంత్రకముగా దహనముచేసిన ప్రేతకు తిరిగి దహనము చేయకూడదు. స్వశాఖావిధితో జరగనియెడల దహనము చేయవచ్చును. దేశాంతమందుపోయినవానిమరణము కుమాళ్లువగైరా కర్తలకు 10రోజుల లోపున తెలిసినయెడల ఆశేషదినములతోనే శుద్ధియగును. కర్మకూడా ఆశేషదినములతోనే ముగించవలెను. 10 రోజులు దాటిన తర్వాత తండ్రి పోయినట్లు తెలిసినయెడల పుత్రులు, భార్య 10 రోజు లాశౌచముపట్టుచు కర్మ యథావిధిగా చేయవలెను. అదిపర కాశౌచముపట్టని జ్ఞాతులు ఈకర్మాచరణము మొదలు మూడురోజు లాశౌచము పట్టవలెను. అదివరకు పట్టిన యెడల కర్మచేయునపుడు జ్ఞాతులకు స్నానముతో శుద్ధియగును.

కుమాళ్లైనను పోయినపదిరోజులలో తెలిసి, మైలుపట్టి, శుభ్యానంతరమందు కర్మచేసేయెడల మూడురోజు లాశౌచముపట్టి, కర్మచేసి, 4 వ రోజున షోడశము 5 వ రోజున సాపిండ్యము చేయవలెను. కుమారుడు తల్లిదండ్రులకర్మ దహానంతరము చేయవలసివచ్చినప్పుడు, పదిరోజుల లోపల మైలపట్టియున్నను, తిరిగి పదిరోజులు మైలపట్టి కర్మచేయుట ముఖ్యము. అనాహితాగ్నికి మరణముమొదలుకొనియు, ఆహితాగ్నికి దహనముమొదలుకొనియు ఆశౌచము పట్టవలెను. దేశాంతరమందు పోయిన ఆహితాగ్నికి కర్మఆచరించేవరకు ఆశౌచములేదు. కావున ప్రేత కుమాళ్లు, జ్ఞాతులందరును సంధ్యాది నిత్యకర్మలు మామూలుగా చేసికోవచ్చును. అతీతప్రేతకర్మ ఆరంభించునపుడు మృతమునకు పనికిరాని తిథి వార నక్షత్రాములు కాక తక్కిన తిథివారనక్షత్రాములయందు ఆరంభించవలెను.

## ఆహితాగ్నే ర్మాసికాదౌ తిథినిర్ణయః

వ:— ఆహితాగ్నికి దహనము మరణతిథియందుగాక మరియొక తిథియందు జరిగిన యెడల అన్యమాసికము మొదలు త్రైపక్షికాంతమువర

వను దహనతిథియందును, ఆపై మాసికాదుల మృతతిథియందును పెట్ట వలెను. దహనముకూడ మృతతిథియందే జరిగినయెడల భేదములేదు.

## దశాహానంతరం సాపత్నిమాతృమరణశ్రవణే

వ:— సమాప్లతేనిసవతితల్లి పోయిన పదిరాత్రులలో తెలిసిన యెడల ఆశేషదినములే ఆశౌచముపట్టి మామూలుగా కర్మయావత్తూ షోడశసాపిండ్యములతో పూర్తిగా చేయవలెను. పదిరోజులు దాటిన తర్వాత ఎన్నిసంవత్సరములైనను మూడురోజు లాశౌచముపట్టి నాలుగవ రోజున షోడశము, అయిదవరోజున సాపిండ్యము వగైరాలు చేయవలెను. సమాప్లుండి కర్మయంతయు అయినతర్వాత తెలిసినయెడల జ్ఞాతులతో పాటు స్నానముతో శుద్ధియగును.

## సంఘాతమరణే

వ:— ఏకారణముచేతనైనను ఒకటేకాలమందు బంధువు లనేకులు చనిపోయినయెడల అందరికిని వాడే కర్తయైతే సంబంధసామీప్యము ననుసరించి ఇద్దరిద్దరిచొప్పున ఏకాదశాహస్సున ఆద్యశ్రాద్ధాంతము కర్మ చేసి, అందరికిని ఆద్యశ్రాద్ధమైన మరునాడు మొదటినుండి వరుసగా షోడశసాపిండ్యములను చేయవలెను.

తల్లిదండ్రులు, సోదరులు వగైరాలు పోయినయెడల తల్లిదండ్రుల కిద్దరకు ఏకాదశాహస్సున ఆద్యశ్రాద్ధాంతముచేసి, ఆతర్వాత రోజుకిద్దరిచొప్పున, మూడేసిరోజులు కర్మనాచరించి, నాలుగవరోజున ఆద్యశ్రాద్ధాంతముచేసి, అందరికి అయినతర్వాత ముందు తండ్రికి, తర్వాత తల్లికి చొప్పున కర్మచేసి, క్రమముగా షోడశసాపిండ్యములుచేయవలెను. తండ్రివగైరాలకు షోడశసాపిండ్యములు వేరే మూడవపక్షములోనైనను చేయవచ్చును.

